# నవతరానికి
# గాంధీజీ
# రోల్ మోడల్

రచన

డా॥ కాళ్ళకూరి శైలజ

సంపాదకత్వం

డా॥ నాగసూరి వేణుగోపాల్



**Navataraniki Gandhiji Role Model**

(an attempt to explain the relevance of Gandhian path to the present generation in Telugu)

By

**Dr. Kallakuri Sailaja**

9885401882

sailaja7074@gmail.com

Editor : Dr. Nagasuri Venugopal



Cover page concept : D. Hari Vivek, B.Tech.

Book Making : Nagalakshmi, D

1st edition : Jan. 2021

No. of Copies : 1000

Price : Rs. 125/-

Published by :



**Gandhi Bhavan**

Venkataratnam Nagar

**KAKINADA**

Phone : 9441011668

Copies can also be had at :

**G. Malyadri**

Vijnana Prachuranalu

162, Vijayalakshmi Nagar

**NELLORE - 524 004 AP**

Phone : 9440503061

&

**Navodaya Book House**

Opp. Metro pillar 14

Kachiguda Crossroads

**HYDERABAD - 500 027**

Phone : 040-24652387

e-dition available at : Kinige

Printed at :

**Karshak Art Printers,** HYDERABAD - 13

Mobile : 98491 13314, 93922 32881

# విషయక్రమం

# గాంధీజీ ఆశయాలతో మమేకం అవుతూ...

- వై.ఎస్.వి.ఎస్.మూర్తి
సెక్రటరీ, గాంధీభవన్, కాకినాడ



మహాత్మాగాంధీ 1921 సంవత్సరంలో తొలిసారి కాకినాడలో పర్యటించారు. ఆ స్ఫూర్తితో ప్రముఖ వైద్యులు శ్రీ తనికెళ్ళ సత్యనారాయణమూర్తి గారు, న్యాయవాది శ్రీ కొమండూరి శఠకోపాచార్యులు గారు, స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్నారు. కాకినాడ మునిసిపల్ ఆఫీసు వెనుక 7200 చ. అడుగుల స్థలాన్ని శ్రీ తనికెళ్ళ సత్యనారాయణ మూర్తి గారు పిఠాపురం మహారాజా వారి వద్ద కొని, మరో ఆరున్నర ఎకరాలు వేళంగి వాస్తవ్యులు శ్రీ మర్ల సుబ్బారావు గారి సౌశీల్యంతో చేర్చి, మొత్తంగా 1950 డిసెంబర్ 1వ తేదీన 'గాంధీభవన్' సంస్థను స్థాపించారు. అప్పటి నుంచి ఈ సంస్థ అనేక సాంఘిక సంక్షేమ కార్యక్రమాలను, నిరుపేద పిల్లలకు చదువు, కుట్టు, టైపింగ్ వంటి అనేక రంగాలలో శిక్షణ కార్యక్రమాలను నిర్వహిస్తోంది.

భూమిని దానం చేసిన మహాదాతలు

2006లో భవన పునర్నిర్మాణం జరుపగా, 2008లో ధ్యాన మందిరం, 2016లో గాంధీ జీవిత సంఘటనల చిత్రపటాలతో 'ప్రదర్శనశాల', శ్రీ డి.వి. ఎన్ శర్మ గారి వితరణతో ఒక గ్రంథాలయం సమ కూర్చబడ్డాయి.

ప్రస్తుతం, గాంధీ భవన్‌కు ఆచార్య దోసగిరి రావు గారు (విశ్రాంత ప్రత్యేకాధికారి, ఆంధ్రా యూనివర్సిటీ) డైరెక్టర్ గానూ, శ్రీ వై ఎస్ వి ఎస్ మూర్తి గారు సెక్రటరీ గాను, వ్యవహరిస్తున్నారు. ఆధునిక యువతకు గాంధీ ప్రగతిశీల సూత్రాల గురించి విశ్లేషణాత్మకంగా అందించే సంకల్పంతో 'నవతరానికి రోల్ మోడల్ గాంధీజీ' అనే పుస్తకం డా.కాళ్ళకూరి శైలజ రచించారు. దీనిని ప్రచురించి, 'గాంధీభవన్', యువతకు మరింత చేరువ కావాలని ఆశిస్తున్నది. ఈ పుస్తక ప్రచురణకు సహకరించిన శ్రీ తనికెళ్ళ సత్యనారాయణ మూర్తి గారి వంశీయులకు ధన్యవాదములు.



# మహాత్మునికి మరొక నీరాజనం

– డా. మండలి బుద్ధప్రసాద్
మాజీ మంత్రి, మాజీ ఉపసభాపతి,
ఆంధ్రప్రదేశ్

మహాత్మాగాంధీ మన దేశంలో ప్రభవించిన మహాపురుషులలో ఒకరు. మన దేశంలో ఎందరో మహనీయులు, మహర్షులు జన్మించారు. ఎన్నివేల సంవత్సరాలు గడిచినా వారి ప్రభావం మనదేశ ప్రజలపై చెక్కుచెదరలేదు. అయితే గాంధీజీ ప్రభావం మాత్రం మన దేశ ప్రజలపై ఎంతగా వుందో, విదేశీయులపై కూడా అంతే ఉంది. ఆయన ప్రభావంతో దక్షిణాఫ్రికా వర్ణ వివక్ష నుంచి జాగృతమైంది. ఆయన ప్రభావం అమెరికా దేశంలో బానిసత్వంలో మగ్గుతున్న నల్లజాతీయులకు స్ఫూర్తినిచ్చింది.

రాజకీయాల్లో ఆయన ఒక కొత్త ఒరవడిని సృష్టించారు. దానిలో శాంతము, నీతి, అహింస ఇమిడి ఉన్నాయి. ఇది అంతకుముందు ఎవరూ ఎరగని పద్ధతి. వీటితో పాటు ఆయన సర్వోదయ సిద్ధాంతాన్ని ప్రబోధించారు. ప్రబోధించడమే కాదు, జీవితాంతం ఆయన ఆ దారిలోనే నడిచారు. అందరి ఉమ్మడి బాగు కోసం పాటుపడాలన్నది సర్వోదయ సిద్ధాంతం. అప్పుడు సమాజంలోని అందరూ బాగుపడడమే కాక, ఎవరికి వారుగా కూడా బాగుపడతారు. ఆయన దృష్టిలో వృత్తి పనులన్నీ సమానమే. ఒక లాయర్ చేసే పని గొప్పదని, ఒక మంగలి చేసే పని తక్కువదని ఎవరూ అనుకోకూడదు. రెండూ ఉదరపోషణకు చేసే పనులే. వాటిలో ఒకటి తక్కువా, మరొకటి ఎక్కువా, అని ఎవరూ భావించరాదు అన్నది గాంధీజీ ఉద్దేశ్యం. రైతులు కాయకష్టం చేసి ధాన్యం పండిస్తారు. వారి కృషి అందరికీ తిండి పెడుతుంది. అందుచేత అది ఉత్తమమైన వృత్తి. చేతి పనులు అందరికీ చేదోడుగా ఉంటాయి. చేతి పనులలో నేత పని మన మానాన్ని కాపాడుతుంది. కమ్మరి పని, కుమ్మరి పని, చివరికి చెప్పులు కుట్టే వృత్తే లేకపోతే మనిషి మనుగడ సాగదు. కాబట్టి, చేతి పనులు చేసే వారిని తక్కువ చేసి చూడరాదు. అది ధర్మం కాదు. నైతికత అంతకంటే కాదు అన్నది గాంధీజీ సిద్ధాంతం. ఈ సిద్ధాంతం సర్వకాలీనమైనది.

గాంధీజీ తరచి, తరచి ఇదే ఆలోచన చేసేవారు. ఇదే ఉద్బోధించేవారు. కాయకష్టంలోని హాయిని ఆయన రుచి చూశారు. అందరినీ ఆ హాయిని రుచి చూడమని ఉద్బోధించారు. నూలు నేసి, మీ బట్టలు మీరే తయారు చేసుకొనండి. మీరు తినే కూరగాయలు మీరే పండించుకోండి. అప్పుడు తిండికీ, గుడ్డకూ ఎవరికీ లోటు ఉండదు. తిండి, గుడ్డ సరిపడా ఉన్న కుటుంబం నుంచి పేదరికం, దారిద్ర్యం వాటికవే పారిపోతాయి. ఈ రకంగా దేశంలో అందరూ కష్టించి పనిచేస్తే, దేశం స్వయం సమృద్ధమవుతుంది. అప్పుడు ఆ దేశం ఎవరికీ, దేనికీ లోటులేనిదిగా రూపొందుతుంది. ఒకరు మరొకరికి తోడ్పడాలి. ఒకరు మరొకరిని దోచుకోకూడదు. ఒక దేశం మరొక దేశాన్ని ఆక్రమణ చేయకూడదు. సత్యం, అహింసకు, శాంతికి మూల కారణం. అదే మానవ జీవితానికి పునాది కావాలి అని గాంధీజీ ఉద్బోధించారు. ఆయన జీవితమంతా సత్యమే పునాదిగా గడిపారు. మానవ జాతిని ప్రేమించి, సేవించడమే ఆయన చేసిన కృషి.

ఆ కృషితోనే ఆయన భారతదేశ స్వాతంత్ర్యోద్యమాన్ని నడిపారు. ఆ కృషితోనే ఆయన జైలుకి వెళ్ళాడు. ఆ కృషిలోనే ఎన్నోసార్లు సత్యాగ్రహాలు, కఠోరమైన ఉపవాస దీక్షలు చేశారు. ఆ కృషిని దేశం మెచ్చింది. మొత్తం దేశం ఆయన వెంట నడిచింది. ఈ కృషి ఆయన 1916 నుంచి 1947 వరకు దాదాపు 30 సంవత్సరాల పాటు కొనసాగించారు. ఈ కృషి మన దేశానికి ఏ ఆయుధం లేకుండా స్వాతంత్ర్యాన్ని సముపార్జించి పెట్టింది.

ఈ కృషి మన దేశాన్నే కాక యావత్ ప్రపంచాన్ని ఆకర్షించింది. గాంధీజీ సిద్ధాంతాల ప్రభావంతో నెల్సన్ మండేలా సౌత్ ఆఫ్రికాలో జాతి వివక్షకు వ్యతిరేకంగా పోరాడి, 20 ఏళ్ళ పాటు జైలు జీవితం గడిపి, దక్షిణాఫ్రికా నుంచి వర్ణ వివక్షతను పారద్రోలారు. ఈ కృషే అమెరికాలో నల్లజాతి నాయకుడు మార్టిన్ లూథర్ కింగ్ జూనియర్ కు ప్రేరణనిచ్చింది. అమెరికాలోని నల్లజాతీయులు బానిసత్వపు శృంఖలాలను తుత్తునియలు చేయడానికి దోహదపడింది. ఈ కృషి ప్రసిద్ధ శాస్త్రవేత్త ఆల్బర్ట్ ఐన్‌స్టీన్‌ను ఆకర్షించింది. మన కాలంలో ఈ భూమిపై నడయాడిన దేవుడు గాంధీజీ అని ఆయన మహాత్మాగాంధీని కొనియాడారు. అమెరికాలో గాంధీజీ సిద్ధాంతాల ఊతంతో సీజర్ చావెజ్, లూయిస్ ఫిషర్ వంటి వారు మానవ హక్కుల కోసం పోరాటం సలిపి, ప్రపంచం దృష్టిని ఆకర్షించి తమ ఉద్యమాలలో సఫలీకృతులైనారు.

ఈ వ్యాస రచయిత్రి డా. కాళ్ళకూరి శైలజ గారి నేపథ్యం, కృషి, పట్టుదల గమనిస్తే విస్మయంతోపాటు ఆనందం కూడా కలుగుతోంది. తూర్పుగోదావరి, శ్రీకాకుళం జిల్లాలో హైస్కూలు దాకా, హైదరాబాదులో ఇంటర్మీడియట్, కర్నూలులో ఎం.బి.బి.ఎస్. చదువుకుని ప్రస్తుతం కాకినాడ రంగరాయ మెడికల్ కాలేజీలో అసోసియేట్ ప్రొఫెసర్ గా పనిచేస్తున్నారు. మక్కువ, పట్టుదల, ప్రతిభ, నైపుణ్యం, సృజన, అనుభవం గల శైలజ రచనా రంగంలో కూడా వైవిధ్యం చూపుతున్నారు. కవితలు, కథలు, వ్యాసాలు – ఇలా విభిన్న ప్రక్రియల్లోనే కాక వస్తు వైవిధ్యం కూడా విశేషంగా వొలికిస్తున్నారు. 2019 అక్టోబరు నుంచి డా. నాగసూరి వేణుగోపాల్‌తో కలసి వారు గాంధీకి సంబంధించి వివిధ వ్యాసాలు చాలా పత్రికలలో ప్రచురింపబడ్డాయి. కరోనా వచ్చిన తర్వాత వైద్యపరమైన సామాజిక అవగాహన కలిగిస్తూ పలు వ్యాసాలు రాశారు. అటువంటి డా. కాళ్ళకూరి శైలజ గారికిది తొలి పుస్తకం. గతంలో కొన్ని సంకలనాలలో వారి రచనలున్నాయి.

ఇక ప్రస్తుత వ్యాస సంకలనం గురించి ఒక మాట చెప్పాలి. గాంధీ శతజయంతి సంవత్సరం నేపథ్యంగా తెలుగులో చాలా పుస్తకాలు, సంకలనాలు వెలువడ్డాయి. 'గాంధీ' సినిమా ప్రపంచ వ్యాప్తంగా ఆసక్తి రేపినా, తెలుగులో ఆయన సిద్ధాంతాలు పెద్ద చర్చింపబడలేదు. అలా ఒక అర శతాబ్దం గడిచిపోయింది. మరలా ఇటీవల తెలుగు ప్రాంతంలో గాంధీ చర్చకు రావడం ఆనందించదగ్గ విషయం. ముఖ్యంగా డా. నాగసూరి వేణుగోపాల్ పూనికతో సంవత్సరకాలంగా వివిధ పత్రికలలో, ఇతర మీడియా వేదికల ద్వారా గాంధీ గురించి ఎన్నో ప్రయోజనకరమైన విషయాలు చూస్తున్నాం. ఇందులో డా. కాళ్ళకూరి శైలజ భాగస్వామిగా నాగసూరికి దోహదపడటం, అందులో భాగంగానే ఈ వ్యాసాలు రాయడం ఆనందదాయకం.

గాంధీ గురించి పెద్దగా ప్రచారం పొందని లేదా ప్రస్తుత తరానికి తెలియని ఎన్నో విషయాలు డా. శైలజగారి వ్యాసాలలో చూడవచ్చు. పిల్లలు, విద్య, మహిళలు, కళలు, అరోగ్యం ఇలా విభిన్న విషయాలకు సంబంధించి మాత్రమే కాక నేటి ప్రతికూల పరిస్థితులకు ఎలా గాంధీ విధానాలు ఎలా ప్రయోజనకరమో వివరించే అంశాలు కూడా ఉండటం ముదావహం. మామూలు మనిషి మహాత్ముడు ఎలా అయ్యాడో, ఆ మహనీయుడు నవతరానికి ఎలా మార్గదర్శకుడు కాగలడో ఈ వ్యాస సంపుటిలో చక్కగా వివరించబడింది. రచయిత్రి డా. కాళ్ళకూరి శైలజకు శుభాకాంక్షలు, అభినందనలు తెలియజేస్తూ గాంధీ గురించి మరిన్ని ఉత్తమ రచనలు చేయాలని కోరుతున్నాను.

# గాంధీ ఇచ్చిన చెల్లాయి

**– డా॥ నాగసూరి వేణుగోపాల్**

"సత్యం అంటే భయం లేకపోవడం" – అని నాలుగో తరగతి చదివే అమ్మాయి తన పుస్తకాల అలమరపై అంటించుకుంది! మరో నాలుగేళ్ళకు అదే పిల్ల గాంధీ స్వీయ చరిత్ర చదివి అడమెంట్, సెల్ఫ్‌రిఫ్లెక్షన్, టియర్స్ ఆఫ్ షేమ్, సెలిబసి, ఎక్స్‌పెరిమెంట్ – వంటి పదాలతో తలమునకలై – సర్దుకుని 'డు వాట్ యూసే ... సే వాట్ యూ థింక్' అని అలమర మీద కాగితాన్ని మార్చుకుంది. పదవ తరగతికి వచ్చేసరికి ఎవరీ మార్క్స్? ఏమిటీ భగవద్గీత? ఎలా సర్వమత గ్రంథాలు చదవడం? ఎలా మనిషిని కాదు మానవుడిని తెలుసుకోవడం? – అనే ప్రశ్నలు తొలిచివేశాయి. "రిలిజియస్‌లీ పర్‌ఫార్మ్‌డ్ డ్యూటీ ... డ్యూటీఫుల్లీ ఫాలోడ్ రిలిజియన్" – అని అలమరపై కాగితాన్ని మళ్ళీ మార్చేసింది. తర్వాత రెండేళ్ళలో 'గాంధీ' సినిమా చూసి ఆయనలోని స్పష్టత, నిరాడంబరత, కార్యశుద్ధి బోధపడి ఓటమిలోని పాఠం వంటి భావనలు అర్థమయ్యాయి. కోరిక, ఆశ, అనుబంధం – వంటి వాటిలో నిబద్ధత తెలుసుకుని నిజాలు నిర్భయంగా ఒప్పుకోవడం అంటే ఏమిటో తెలుసుకుంది ఆ అమ్మాయి. వైద్యవృత్తిలో ప్రవేశించిన ఈ నవయువతి ఆ కాగితం పై మాటలు "దేర్ ఆర్ ఓన్లీ ఫోర్ గ్రూప్స్ ఆఫ్ పీపుల్ ఎ, బి, ఎబి & ఓ" అని బ్లడ్ గ్రూప్స్ రాసుకుంది!

* * *

దాదాపు ఇవే మాటలను కాకతాళీయంగా చూశాను! ఏమి తీక్షణత? ఏమి చురుకుదనం? ఏమి గమనింపు? ఏమి సిన్సియారిటీ? ... అనే ప్రశ్నలు నన్ను ముంచివేశాయి. నిజానికి ఆ పేరు ఫేస్‌బుక్‌లోనే పరిచయం. ఔరా – అనుకుని ఫేస్‌బుక్ ద్వారానే ఫోన్ నెంబరు కోసం ప్రయత్నం చేశా.

నిజానికి ఫేస్‌బుక్ అంటే ఆధునిక వ్యసనం. బద్ధకాన్నీ, అతిని, మితిలేని వాగుడునూ, వళ్ళు తెలియని స్వాతిశయాన్నీ, ఎగ్జిబిషనిజాన్నీ పెంచి పోగుచేస్తోంది. అయితే, అదే సమయంలో శ్రమలేకుండా సమాజం తీరును తెలుసుకోవడానికి ఒక టెలిస్కోపులా, ఒక పెరిస్కోపులా, ఒక మైక్రోస్కోపులా తోడ్పడుతుంది. కష్టపడకుండా ఎవరేమిటో ఫేస్‌బుక్ అద్దం ద్వారా సులువుగా తెలుసుకోవచ్చు, ఫ్రెండ్స్‌ని ఎంపిక చేసుకోవచ్చు. బాధ్యతా రహితమైన బూతు సరంజామానే కాదు. అత్యంత విలువైన

సమాచారం, ఫోటోలు, సంగీతం ఇలా మరెన్నో కూడా దీని ద్వారానే లభ్యమవుతాయి. ఎవరి స్థాయిని బట్టి వారు తమ ఫ్రెండ్స్ గుంపును నిర్ణయించుకోవచ్చు. అలా ఫేస్‌బుక్ బురదలో నుంచి ఆలోచనాత్మకమైన, కళాత్మకమైన పద్మంలాంటి పలుకుల హారాన్నీ, ఆహార్యాన్నీ ధరించిన సుగుణశీలను గుర్తించాను. ఆవిడే డా.కాళ్లకూరి శైలజ! ఆ మాటలూ, వాటి వెనుక ఉండే ఆవిడ మూర్తిమత్వమూ, దాని వెనుక గొప్పగా వెలుగును పంచే గాంధీ ప్రత్యేకతా గమనించ గలిగాను. తనను జీవితకాలపు చెల్లాయిగా నేను ఆ మరుక్షణమే నిర్ణయించుకున్నాను! శైలజను సంప్రదించి తీసుకున్న నిర్ణయం కాదిది. రోగిని పరీక్షించిన వైద్యురాలిలా – తను అధ్యయనం చేసి గాంధీ ఇచ్చిన చెల్లాయిగా మారిపోయింది.

* * *

అది 2018 ఆగస్టు నెల ముందు కావచ్చు. సరిగ్గా తేదీ చెప్పలేను. గాంధీ 150వ జయంతి వార్షిక సందర్భంగా మండలి బుద్ధప్రసాద్ గారు సైన్స్ గురించి గాంధీ అనే వ్యాసాన్ని రాయమన్నారు. "పర్యావరణం గురించి కాదా" – అని ప్రశ్నించినపుడు వారు స్పష్టంగా "వేరొకరు పర్యావరణం గురించి రాస్తున్నారు కనుక, కేవలం సైన్స్ గురించి రాయండి" అన్నారు. అనిల్ అగర్వాల్ నిర్వహించిన పక్షపత్రిక 'డౌన్ టూ ఎర్త్' ను 1999 – 2000 కాలంలో చాలా రెగ్యులర్‌గా అధ్యయనం చేసేవాడిని. అదే కాలంలో పర్యావరణం గురించి నేను 'ప్రకృతి–వికృతి' శీర్షికను 'వార్త' దినపత్రిక ఆదివారం సంచిక కోసం రాస్తున్నాను కూడా. అలా తరచి చూస్తున్నపుడు పర్యావరణ సమస్యలకు గాంధీ తరుణోపాయం చూపారని ఆ పత్రికలో తొలిసారి చూసినపుడు ఉలిక్కిపడ్డాను. ఫలితంగా గాంధీ చూపు, అధ్యయన విస్తృతి, పరిష్కార దార్శనికత పట్ల గౌరవం, ఆసక్తి పెరిగాయి.

2001 జనవరిలో నేను వెలువరించిన 'సైన్స్ వాచ్' పుస్తకం కవర్ పేజీమీద గాంధీ, ఐన్‌స్టీన్ లుంటారు. 2004–'05 ప్రాంతంలో విశాఖపట్నం గాంధీ సెంటర్‌లో కె.ఎస్.శాస్త్రిగారు పర్యావరణం, అభివృద్ధి, విజ్ఞానం మొదలైన వాటి గురించి తాము ప్రచురించిన చిన్న చిన్న ఆంగ్ల పుస్తకాలు ఇచ్చారు. వాటిని కొంత అధ్యయనం చేశాను కూడా. అయితే లోతయిన దృష్టికి సమయం దొరకలేదు. కనుక 2018 అక్టోబరు 2కు విడుదలయ్యే ప్రత్యేక సంకలనానికి రాయాలని, అధ్యయనం చేయాలని నిర్ణయించుకున్నాను. తిరుపతి నుంచి హైదరాబాదుకు 2018 ఆగస్టులో బదిలీ అయ్యాను. ప్రతివారం ప్రయాణాలూ, ట్రైనింగ్ ఇన్‌స్టిట్యూట్‌లో కొత్త బాధ్యతలూ మధ్య గాంధీ సైన్స్ గురించి శోధన మొదలైంది కానీ గొప్పగా సాగలేదు. ఈ సమయంలో గీతా వెల్లంకి నా విన్నపం మేరకు ఒక అద్భుతమైన వ్యాసం ఇంటర్‌నెట్‌లో

వెతికి పట్టుకుంది. 'టూవర్డ్స్ యాన్ అండర్ స్టాండింగ్ ఆఫ్ గాంధీస్ వ్యూస్ ఆన్ సైన్స్' అని శంభుప్రసాద్ రాసిన సుదీర్ఘమైన వ్యాసం. ఒక రకంగా 2000 సం॥ దాకా గాంధీ సైన్స్ దృష్టి పట్లా జరిగిన అర్థం లేని ప్రచారం గురించీ అలాగే గాంధీ అర్థవంతమైన దృష్టిపట్ల లోతయిన విశ్లేషణా – ఇలా బోలెడు సమాచారం వుంది.

ఈ వ్యాసంతో విడతలుగా కుస్తీ పడుతున్న సమయంలో డా॥ కాళ్ళకూరి శైలజ ఫేస్ బుక్‌లో మాటలు నన్ను విస్మయానికీ, ఆనందానికీ గురి చేశాయి. ఫేస్‌బుక్ ద్వారా తనను సంప్రదించి, కాంటాక్టు నెంబర్ తీసుకుని ఫోన్‌లో పలకరించాను. జిడ్డు కృష్ణమూర్తి ఆలోచనలు పంచుకునేందుకు 2018 ఆగస్టు నెల చివరిలో ఓ మూడురోజులు మద్రాసు మేము (నేను, హంస) వెళ్ళాము. ఆ సమయంలో ఆగస్టు 25 లేదా 26న డా.శైలజ గారిని ఫోన్‌లో పలకరించాను. అలా మా పరిచయం, స్నేహం మొదలైంది. కాలం గడిచే కొద్దీ పరస్పర గౌరవం పెరుగుతున్నాయి. సైన్స్ చదువు, రచనా వ్యాసంగం, ఆశావహ దృక్పథం, సేవాదృష్టి, గాంధీ పట్ల గౌరవం – మా ఇద్దరి మధ్య సామీప్యాన్ని పెంచాయి. 2018 అక్టోబరు నుంచి 2019 జనవరి దాకా మేము కలసి గాంధీ గురించి కొన్ని వ్యాసాలు రాశాం. అవి ఆంధ్రప్రభ, ఆంధ్రభూమి, సూర్య పత్రికలలో ప్రచురింపబడ్డాయి. మార్చి 2020 తర్వాత కరోనా గురించి కొన్ని వ్యాసాలు ఇద్దరి పేర్లతో ప్రచురింపబడ్డాయి. 2020 జూలై నుంచి **గాంధీయే మార్గం (సూర్య** దినపత్రిక, ప్రతి శుక్రవారం), **గాంధేయం ఒక గాండీవం (ఆంధ్రప్రభ** దినపత్రిక, ప్రతి ఆదివారం) ద్వారా గాంధీ మీద సరి కొత్తగా ఆధ్యయనం ప్రారంభించినపుడు చెల్లాయి శైలజ ఇంకాస్త ఉత్సాహంగా సమిష్టి కృషిలో అమరిపోయింది.

2019 అక్టోబరు నుంచి సంవత్సరం తిరిగేసరికి అచ్చంగా గాంధీ పైనే ఓ డజను వ్యాసాలు పైనే వచ్చి చేరాయి. వాటికి అదనంగా కొత్త వ్యాసాన్ని, ఇతర అంశాలను కలిపి ఇపుడు పుస్తకంగా వెలువరిస్తోంది శైలజ – **నవతరానికి గాంధీజీ రోల్ మోడల్** పేరుతో!

* * *

తెలుగు పాఠకులకు కొన్ని దశాబ్దాలుగా గాంధీజీ గురించిన సవ్యమైన, సమగ్రమైన సమాచారం దొరకక పోవడమో లేదా దొరికిన కొంత సమాచారం మరో ఉద్దేశ్యంతో రూపొందించినదిగా ఉండటమో జరిగింది. గాంధీని దేవుడు, మహాత్ముడు అని కాకుండా – ఆయన చాలామంది కన్నా మనిషిగా ఏ రకంగా మెరుగు, ఆయన ఆలోచనలు వర్తమాన తరానికి ఎంతవరకు ప్రయోజనకరమని కొంత అధ్యయనం చేసి ఈ వ్యాసాలు ఒక బృహత్తర ప్రణాళికలో అంతర్భాగంగా

రాయబడ్డాయి. పిల్లల పెంపకం, విద్య, జీవన శైలి, మహిళలు, కస్తూరిబాయి, ఆరోగ్య ఉద్యమం, పాత్రికేయత్వం, గాంధీ చెప్పేదేమిటి? కళలు, ఇలా పలు కోణాలలో డా. శైలజ గాంధీని పరిశీలించి ఈ వ్యాసాలను రాశారు.

1926 ఏప్రిల్ 15న అహ్మదాబాద్ లో మాట్లాడుతూ గాంధీజీ ఇలా అన్నారు "సంగీతం గురించి మనం మరింత విశాలంగా ఆలోచించాలి, అందలి లయ, శృతి, స్పందన ఈ మూడు లేకుండా జీవితంలో ఏ పనినీ చేయలేమని తోస్తుంది. అలా ఆలోచిస్తే ఏ తల్లిదండ్రులు తమ పిల్లలను సంగీతాభ్యాసం కోసం పంపిస్తారో వారు ఈ దేశ పురోగమనానికి దోహదపడే వ్యక్తులు కాగలరు."

మరొక సందర్భంలో గాంధీజీనే ఇలా అన్నారు, "ఎందుకో గానీ, మనం సంగీతం అంటే ఒక పాట పాడడం, ఒక వాయిద్యాన్ని తగు నైపుణ్యంతో వినిపించడం అనుకుంటున్నాము. కానీ, నిజానికి సంగీతం అంటే ఏక తాళం, ఏకతారాగం. అది ఆ మనిషి హృదయ తంత్రులన్నీ కలిపి ఒకే ఒక అపురూప స్వరంగా గానం చెయ్యడమే. ఎంతో లోతైన భావన ఇది!" ఈ అభిప్రాయాలను చదువుతున్నప్పుడు గాంధీ సమగ్ర దృష్టిని, సున్నితత్వాన్ని, భావుకతను మనం అభినందించకుండా ఉండలేము. నిజానికి ఇటువంటి విలక్షణ అధ్యయనం చాలా చాలా అవసరం. అందుకే డా॥ కాళ్ళకూరి శైలజను మనస్ఫూర్తిగా గాంధీజీ ఆలోచనలు ఆలంబనగా అభినందిస్తున్నాను.

* * *

గాంధీ మహాశయుడు ఒక కొలను కాదు, సముద్రం, మహాసముద్రం, బృహత్ మహాసముద్రం! ఆ సముద్రం దగ్గర నేనూ శైలజా కలసి పనికొచ్చే ఆలోచనలనే చిరుగవ్వలను పోగుచేస్తున్నాం. శ్రీయుతులు అవధానం రఘుకుమార్, కాళ్ళకూరి శేషమ్మ, వింజనంపాటి రాఘవరావు, తిరువాయపాటి రాజగోపాల్, కె.సురేష్, టి.వి.రమేష్, రమాసుందరి గార్లు, ఇంకా మండలి బుద్ధ ప్రసాద్, నందివెలుగు ముక్తేశ్వరరావు వంటి పెద్దలు కూడా మాతో కలిశారు. నేటితరానికీ, భవిష్యత్తరాలకూ గాంధీజీని సవ్యంగా పరిచయం చేయాలనే మా అందరి తపన. అందులో భాగంగానే ఈ వ్యాసరచన, ఈ పుస్తకం!

చెల్లాయి, రచయిత్రి డా॥ కాళ్ళకూరి శైలజకు అభినందనలు, శుభాకాంక్షలు! ఈ పుస్తకంలో మరిన్ని మంచి వ్యాసాలు ముందు ముందు వచ్చి చేరాలని, ఈ పుస్తకం మరిన్ని ప్రచురణలు పొందాలని నా ఆశ, ఆకాంక్ష!



# తొలి ఆదర్శమూర్తి

**- డా. కాళ్ళకూరి శైలజ**

**జీ**వితానికి ఒక ఆదర్శం కావాలి. ఒక గమ్యం ఉండాలి. నా జీవితంలో ప్రభుత్వ బాలికోన్నత పాఠశాల, శ్రీకాకుళం లో 1974 నుంచి 80 వరకు జరిగింది. అక్కడి ఉపాధ్యాయులు పాఠాలతో పాటు జీవితానికి అవసరమైన ఎన్నో విలువలను నేర్పారు. అక్కడే నా 'తొలి ఆదర్శమూర్తి' గా జాతిపిత గాంధీజీ ని భావించాను.

'సత్యాగ్రహి' అనే ఆరవ తరగతి పాఠం వద్ద ఇచ్చిన గాంధీజీ ఫోటోను చూస్తే ఆయనకు బౌద్ధ బిక్షువుకు తేడా లేదు అనిపించింది. ఆ ఇద్దరు మానవతా మూర్తులను నా హృదయంలో ప్రతిష్ఠించుకున్నాను. అష్టాంగమార్గంతో బుద్ధుడు, సత్యాహింసలతో గాంధీజీ, సాధించిన సంయమనం నన్ను సదా ప్రభావితం చేస్తుంది.

"మనది కానిది బంగారమైనా గడ్డి పరకయే" అని చెప్పిన తండ్రి, "నీ పని యందు నైపుణ్యము కలదా, రాజుల యెదుట నిలువగలవు" అన్న బైబిల్ వాక్యంలో సొగసును బోధించి ఏ బలహీనతలకు లోబడకుండా బ్రతుకగల ధైర్యం నింపిన తల్లి నాకు లభించిన వరం.

మహాత్మా గాంధీ జీవన శైలిని గమనిస్తే సత్యం, అహింస అనేవి ఆచరణలో పెట్టడానికి గొప్ప మానసిక క్రమశిక్షణ అవసరం అని తెలుస్తుంది. వారి సమయపాలన, అనుదిన అభ్యాసం నా వ్యక్తిగత జీవన విధానాన్ని ఎంతో ప్రభావితం చేసాయి. నేను రచనా వ్యాసంగంలోకి వచ్చిన తొలినాళ్లలోనే మహాత్మాగాంధీ గురించి వ్రాయగల మహద్భాగ్యం లభించింది. ఈ క్రమంలో శ్రీ నాగసూరి వేణుగోపాల్ గారి ప్రోత్సాహం మరువలేనిది. మహాత్మాగాంధీ 150 జయంతి ఉత్సవాల ముగింపు కార్యక్రమాల సందర్భంగా వారి ప్రోద్బలంతో 'గాంధీ మార్గం' పై లోతుగా అధ్యయనం చేసి, వ్యాసాలు వ్రాసే అవకాశం వచ్చింది.

కేవలం సంఘటనలను గురించి వ్రాయడం కాక, గాంధీజీ ఆలోచనలను విశ్లేషణాత్మకంగా చర్చిస్తూ, మనోవైజ్ఞానిక కోణంలో వ్రాయడం ఈ వ్యాసాల ప్రధానోద్దేశం. వీటిని ఒక పుస్తక రూపంలోకి తీసుకు రావాలనే సూచన ఇచ్చినది కూడా శ్రీ నాగసూరి వేణుగోపాల్ గారే.

గాంధీజీ ఇచ్చిన సత్య సందేశం ఆయన జీవితమే. భారత జాతిపితగానే కాక ప్రపంచ నాయకునిగా ఆయన జీవితంలోని ముఖ్య ఘట్టాలను పునశ్చరణ చేసినది ఈ సంకలనంలో తొలి వ్యాసం. పిల్లల పెంపకం, విద్యా బోధన, ఆరోగ్య సూత్రాలు,

గాంధీజీ పత్రికా వ్యాసంగం, ఆయన జీవనశైలి అనే విభిన్నమైన అంశాలను స్పృశిస్తూ గాంధీజీ దృక్కోణం ఆవిష్కరించే వ్యాసాలు వరుసగా ఉన్నాయి.

ఇవి కాక, కళలను గురించి, గాంధీజీ చిహ్నంగా చెప్పబడే మూడు కోతుల విశిష్టత అనే అంశాల గురించి ఈ వ్యాసాల్లో చర్చించాను. తన బాల్యంలో సిగ్గరిగా వున్న గాంధీ మహాత్మునిగా రూపొందిన వైనం మరొక వ్యాసంలో సహేతుకంగా పరిశీలించడం జరిగింది. గాంధీ జీవితంలో కస్తూరిబా పాత్ర నా మనసుకు దగ్గరైన అంశం. దీనిని కూడా పుస్తకంలో పొందుపరిచాను.

28 మార్చి 1936 హరిజన్ పత్రికలో గాంధీజీ ఇలా వ్రాసుకున్నారు. "గాంధీయిజం అంటూ ఏమీ లేదు. నాదంటూ ఒక సిద్ధాంతాన్ని ప్రపంచానికి ఇచ్చే ఉద్దేశం నాకు లేదు. కొత్త సిద్ధాంతాన్ని నేను కనుగొన లేదు. నాకున్న అభిప్రాయాలు అంతిమమైనవి కావు. వాటిని నేను భవిష్యత్తులో మార్చుకోవచ్చు కూడా. సత్యము, అహింస అనేవి అత్యంత పురాతనమైనవి. నేను చేసిందల్లా వాటిని భారీ ఎత్తున ప్రయోగించడానికి ప్రయత్నించడమే.

ఆధునిక మానవ సమాజం కుల, మత, వర్గ, వర్ణ భాష, ప్రాంతీయ విభేదాలతో అతలాకుతలం ఔతోంది. వ్యాపార దృష్టి, తీవ్రవాదం, హింస పెరిగాయి. తుపాకీ సంస్కృతి, మాఫియా, బయో వార్, మాదకద్రవ్యాల వాడకం వంటి పక్కదారులు పట్టి యువత వెర్రి తలలు వేస్తున్న సమయమిది. ఈ నేపథ్యంలో గాంధీ మార్గం చాలా అవసరం.

నిజాయితీగా ఉంటూ సర్వజన శ్రేయస్సుకై జీవించే మార్గం గాంధీజీ చూపిన దారి. నవతరం ఈ పుస్తకం ద్వారా ఈ సత్యం గ్రహించాలని నా అభిలాష.

ఈ పుస్తకానికి ఒక ప్రత్యేక అనుబంధాన్ని జత పరిచాము. అదే, తెలుగు నేలపై గాంధీజీ పర్యటన గురించిన వివరాలు.

"ఆంధ్రప్రదేశ్‌లో గాంధీజీ" అనే మూలగ్రంథం శ్రీ కొడాలి ఆంజనేయులు గారి సంపాదకత్వంలో తొలిసారి 1975లో వెలువడింది. ఈ పుస్తకం నుంచి గాంధీజీ

ఆంధ్రప్రాంత పర్యటన విశేషాలను క్రోడీకరించమని, ప్రముఖ సైన్స్ రచయిత, మీడియా విశ్లేషకులు శ్రీ నాగసూరి వేణుగోపాల్ గారు ఒక గొప్ప సూచనను చేశారు. వారికి నా నమస్కృతులు.

ఈ విలువైన పుస్తకం పీడీఎఫ్ రూపంలో ఇచ్చిన, సైన్స్ రచయిత, పరిశోధకులు హైదరాబాద్ వాస్తవ్యులు డా.వి.వి.వెంకట రమణ గారికి, అపురూపమైన ఈ పుస్తకం కవర్ పేజీ పీడీఎఫ్‌ను పంపిన సూర్యాపేట జిల్లా, కోదాడకు చెందిన శ్రీ బండారు రామాచారి గారికి నా కృతజ్ఞతలు.

అడుగడుగున నా చేయి పట్టుకొని నడిపి, ఈ సంపుటికి సంపాదకత్వం వహించడమే కాకుండా, అదనపు విలువను పెంచేలా గత పది సంవత్సరాలుగా తెలుగు రచయితలు అందించిన గాంధీజీ సాహిత్య వివరాలు పొందుపరిచిన శ్రీ నాగసూరి వేణుగోపాల్ గారికి నా నమస్సులు.

కోరిన వెంటనే ముందుమాట వ్రాసిన ప్రముఖ గాంధేయవాది, మాజీ మంత్రి శ్రీ మండలి బుద్ధప్రసాద్ గారికి నా హృదయపూర్వక ధన్యవాదాలు.

గాంధీ ఆశయాలకోసం శ్రమిస్తున్న పెద్దలు గాంధీ గ్లోబల్ ఫ్యామిలీ ఛైర్మన్ శ్రీ గున్న రాజేందర్ రెడ్డి గారికి ధన్యవాదములు.

ఈ పుస్తక ప్రచురణకు ముందుకు వచ్చిన గాంధీ భవన్, కాకినాడ వారికి నా కృతజ్ఞతలు.

ఈ పుస్తకం డి.టి.పి పనులను అత్యంత శ్రద్ధతో చేసి, సహకరించిన శ్రీమతి దామరాజు నాగలక్ష్మి గారికి నా నమస్కారాలు.

నా తల్లిదండ్రులకు, నా భర్త శ్రీ దామరాజు శేషగిరిరావు, మా అబ్బాయి చి.హరివివేక్‌లకు, నన్ను ప్రోత్సహించిన మా ఆచార్యులు ప్రొఫెసర్ డాక్టర్ పి.వెంకట బుద్ధా గారికి నా ధన్యవాదాలు. ఈ వ్యాసాలను చదివి, నాకు ఫోన్ చేసి మరీ, నాలో ఉత్సాహం నింపి, ప్రోత్సహించిన తెలుగు నేల నాలుగు చెరగులా ఉన్న అనేకమంది గాంధేయులకు నా వినమ్ర ప్రణామాలు.

గాంధీజీ ఆలోచనా స్రవంతి ఒక వాదం కాదు. తరతరాలకు స్ఫూర్తి. ఇది నేటి తరానికి అందించాలని నా ఆకాంక్ష.



# ప్రపంచానికి భారతీయ సత్యసందేశం

1869 అక్టోబరు 2న పోర్‌బందర్‌లో జన్మించిన మోహన్‌దాస్ కరంచంద్ గాంధీ తన జీవితకాలంలో ఆనాటి ప్రపంచపు అతిపెద్ద రాజకీయ ఆక్రమణను ఎదుర్కొన్నాడు. సత్యము, అహింస అనేవి ఆయన పాటించిన అతి ముఖ్యమైన సూత్రాలు.

"రాబోయే తరాల వారు ఇటువంటి ఒక వ్యక్తి ఉన్నాడని, రక్త మాంసాలతో ఈ నేలపైన మనలాగే జీవించాడని నమ్మడం చాలా కష్టం" అని గొప్ప శాస్త్రజ్ఞుడు, అణు శక్తి సూత్రం కనుగొని, పశ్చాత్తాపంతో ప్రపంచ శాంతికై చేయగలిగిన ప్రయత్నమంతా చేసిన విశిష్ట వ్యక్తి ఆల్బర్ట్ ఐన్‌స్టీన్ చెప్పారు.

గాంధీజీ జన్మించి ఒకటిన్నర శతాబ్దం పైగా గడిచింది. అయినా, ఒక జాతి ఆయనను స్మరించుకుంటూ ఉంది. ఏ దేశ చరిత్ర చూసినా, అప్పటి సామాజిక, రాజకీయ సంక్షోభాలకు సమాధానంగా ఒక ఉద్యమం, అందుకు పాటు పడే నాయకులు జన్మిస్తారు. అలా భారత జాతీయోద్యమం సమయానికి ఎందరో నాయకులు పుట్టారు. అయితే వారందరిలో దేశ, విదేశీయుల చేత, కళాకారులు, సంఘసంస్కర్తల చేత కూడ మన్ననలు పొందిన అరుదైన నాయకునిగా గాంధీని చెప్పుకోవచ్చు.

### బాల్యం

1869 అక్టోబరు 2 గుజరాత్, పోర్బందరులో ఒక దివాన్ కుమారునిగా గాంధీ జన్మించాడు. గాంధీ పాఠశాలలో చదువుతున్నప్పుడే స్కూలు తనిఖీదారు వచ్చినప్పుడు తన సహ విద్యార్థి పుస్తకంలోంచి ఒక ఇంగ్లీషు పదం యొక్క అక్షరాల అమరికను 'చూచి' రాయమంటే వ్రాయలేదు. కాపీ కొట్టడం తప్పుగా భావించాడు. "విషయాన్ని నేర్చుకోవాలి కానీ, శిక్షను తప్పించుకోవడానికి శిక్షణలో రాజీ పడకూడదని" నిర్ణయించుకున్నాడు. పెద్దలు చెప్పినా తప్పు తప్పే అనే వ్యక్తిత్వం గాంధీ అలవరుచుకున్నాడు.

గాంధీ బాల్యంలో ఒకసారి తన తండ్రితో అబద్ధం చెప్పాడు. తరువాత పశ్చాత్తాపంతో, తన తండ్రికి క్షమాపణ ఉత్తరం రాసి ఇచ్చాడట.

అప్పుడు తండ్రి ప్రత్యక్షంగా, పరోక్షంగా సైతం గాంధీని శిక్షించకుండా , కుమారుడు అబద్దం చెప్పవలసిన అవసరం ఎందుకు వచ్చిందోనని తనలో తాను కుమిలిపోయాడు. అలా తన కన్నతండ్రి కార్చిన కన్నీళ్లలోంచి అహింసా మార్గం పుట్టిందని గాంధీ తన ఆత్మకథ లో చెప్పారు. తప్పు జరిగినప్పుడు దానిని తెలియజేసి, సరిదిద్దాలి తప్ప శిక్షను అమలు చేస్తే పెద్దల అనుభవం నిష్ఫలమైపోతుంది కదా అంటారు గాంధీ.

సత్యహరిశ్చంద్ర, శ్రవణ కుమారుడు అనే రెండు నాటకాల వల్ల తనకు సత్యం విలువ, పెద్దల పట్ల గౌరవం కలిగాయని గాంధీ చెప్పారు. ఆ రెండు నాటికలను తన హృదయ ఫలకం పై అనేక సార్లు చిత్రించుకున్నానని గాంధీ చెప్తారు.

ఆ రెండిటిలో ఏముంది? ఒక నియమాన్ని పాటించడం వల్ల ఎదురయ్యే ఇబ్బందులు, పరీక్షలు, ఆటంకాలు కష్టాలు ఇవన్నీ ఉన్నాయి. అయినా అవి చూసిన గాంధీ హృదయం మటుకు సున్నితత్వాన్ని, సునిశితమైన వివేకాన్ని తన జీవితాంతం కాపాడుకోవడం ఆశ్చర్యంగా తోస్తుంది. ఇదే భవిష్యత్తులో గాంధీ కార్యశూరతకు పునాది అయింది.

ప్రతి వ్యక్తి వయసులో ఎదిగిన కొలదీ కుటుంబం, సమాజం, ప్రాంతం, దేశం సరిహద్దులు దాటి వెడుతూ చిన్నప్పుడు తెలుసుకున్న విలువలకు ఎదురు దెబ్బలు తగిలి రాజీపడే అవకాశం ఉంది. కానీ, గాంధీ "ప్రపంచమంతా ఎదురు నిలిచినా, సత్యం వైపు నేను ఒంటరిగా ఉన్నా, సత్యం కోసమే పోరాడతాను, ఏం జరిగినా సరే," అన్నారు.

సంక్లిష్ట పరిస్థితులలో, ఒక విషయం గురించి అనేకమైన అభిప్రాయాలున్నప్పుడు కూడా, ఎటూ ఒరిగి పోకుండా, సత్యాన్ని అన్వేషించి, తెలుసుకుని అప్పుడే ముందుకు వెళ్లడం అలవాటు చేసుకున్నాడు ఆయన.

## అంతరంగ ఘర్షణ- కార్యాచరణ

విదేశాలలో అనేక మతాలు, ధర్మాలు ఆహారపుటలవాట్లను గమనించినప్పుడు, ఇతర దేశాల సంస్కృతిని పరిశీలించినప్పుడు, వర్ణ వివక్ష పై ఉద్యమానికి శ్రీకారం

చుట్టే ముందు, వారణాసి హిందూ విశ్వవిద్యాలయ శంకుస్థాపన సందర్భంలో జరిగిన సమావేశంలో ప్రసంగం చేసినప్పుడు ప్రసంగించినప్పుడు, చంపారన్ రైతుల 'తీన్ కథియా' పన్ను గురించి ప్రభుత్వంతో తల పడినప్పుడు, ఖిలాఫత్ ఉద్యమం గురించి తన అభిప్రాయాలను తెలిపినపుడు ఇలా ప్రతి సారీ కార్యాచరణకు ముందు సత్యాన్ని శోధించి, పోరాడాలని నిర్ణయం తీసుకుని, తన కార్యాచరణ మార్గాన్ని ఎంచుకున్న నిర్మల మానవుడు గాంధీజీ.

## విదేశీ విద్యాభ్యాసం

గాంధీ ఉన్నతవిద్య కోసం ఇంగ్లాండ్‌కు పయనమయినపుడు తాను వైద్య విద్య నేర్చుకోవాలనే కోరికను తెలిపాడు. ఆయన తండ్రి మరణం తరువాత చదువనేది ఉద్యోగ సంపాదనకు అనువుగా ఉండాలి, పైగా తాము వైష్ణవులు కావడం వలన మృతదేహాలను ముట్టుకుని శరీర నిర్మాణశాస్త్రం చదవడం ఆచార విరుద్ధమనీ న్యాయశాస్త్రం చదవమని బంధువులు సూచించారు. గాంధీ తల్లి సముద్రం దాటి వెళ్ళవద్దని ఆంక్షలు విధించారు. ఆపాటికి గాంధీకి కస్తూరిబాయితో వివాహం కూడ జరిగింది. అప్పుడు గాంధీ మద్యం– మాంసం ముట్టనని, పరాయి స్త్రీతో సంబంధం పెట్టుకోననీ తన తల్లికి ప్రమాణం చేసి బయలుదేరాడు.

ఇచ్చిన మాటను నిలబెట్టుకోవడం కోసం గాంధీ ఎన్ని ఇక్కట్లు పడవలసి వచ్చిందో తన ఆత్మకథలో వ్రాస్తారు.

గాంధీ నిరంతరం నేర్చుకుంటూ, తాను తెలుసుకున్న సత్యాలను నియమ నిబంధనలతో ఒక చోట రాసి పెట్టుకుని మరీ తు.చ తప్పక పాటించే వ్యక్తిగత క్రమశిక్షణగల మనిషి. ఆయన సమస్య వద్దకు వెళ్లేవాడో లేక సమస్య ఆయన వద్దకు వచ్చేదో కానీ, ప్రతిసారీ సమస్యలను కూలంకషంగా, లోతుగా పరిశీలించి ఆ తరువాతనే పరిష్కారం కోసం పరిశ్రమించే వాడు.

మత సంబంధమైన నీతి సూక్తులు, మంచి మాటలను సాక్ష్యాధారాలు లేకపోయినా, గుడ్డిగా నమ్మే సంస్కృతిలో జన్మించినప్పటికీ గాంధీ ఎవరేం చెప్తే దానిని వెంటనే నమ్మక, స్వయంగా అధ్యయనం చేసి, అనేక తాత్వికుల– రచయితల ప్రసిద్ధ రచనలను చదివి, ఆకళింపు చేసుకుని అప్పుడే నిజాన్ని సత్యంగా అంగీకరించేవారు.

పైగా తన అభిప్రాయాన్ని కాలక్రమంలో ఋజువులను బట్టి మార్చుకుంటే తదుపరి అభిప్రాయమే సరైనది అని వివరణ ఇచ్చారు.

ఇది గాంధీ శాస్త్రీయ ధోరణి నుంచి తెలియజేస్తుంది.

## ఇంగ్లాండులో జీవితం

ఇంగ్లాండులో గాంధీ క్రైస్తవులను, థియసోఫికల్ సొసైటీకి సంబంధించిన వారిని కలుసుకున్నారు. ఎడ్విన్ ఆర్నాల్డ్, లియో టాల్‌స్టాయ్, అనిబిసెంట్ వ్రాసిన పుస్తకాలను చదవడం ఆయనకు యవ్వనంలో లభించిన గొప్ప అవకాశం. ప్రతి గ్రంథం నుండి గాంధీ నేర్చుకున్న ఒక్కొక్క కొత్త విషయం ఆయనను మరింత దృఢంగా తయారు చేశాయనడంలో ఎటువంటి సందేహం లేదు. మతం, ప్రాంతం, భాష అనేవి వేర్పాటు అంశాలై మనుషులను విడదీస్తాయి, అన్ని మతాల సారాంశము, అన్ని సంస్కృతుల గమ్యం మానవుల ఐక్యత, తద్వారా సమాజ శ్రేయస్సుఅని ఆయన అర్థం చేసుకున్నారు. విశ్వ మానవునిగా తన ప్రయాణాన్ని ఆరంభించాడు. మహమ్మదీయ మతానికి సంబంధించిన ప్రముఖ గ్రంథం 'ఖురాను' ను ఉర్దూ భాష నేర్చుకొని మరీ ఆయన చదివారు.

ఇంగ్లీషు, జర్మన్, లాటిన్ భాషలను నేర్చుకున్నారు. శాకాహారులకోసం ఒక క్లబ్ నడపడం ఆయన ఇంగ్లాండులో సాధించిన విజయం.

స్వదేశం వచ్చాక తన ఊరి వద్ద బారిష్టరుగా, దివాను ఉద్యోగ ప్రయత్నం చేయగా ఇమడలేక, దక్షిణ ఆఫ్రికాకు వెళ్లారు. అప్పటికే గుజరాతీయులు పలుమంది అక్కడ పనిచేసేవారు. వారితో కలిసి అక్కడ ప్రవాసీయుల సమస్యలను గాంధీ స్వయంగా అనుభవించారు.

గాంధీజీ తాను వేసిన ప్రతి అడుగు, తద్వారా వచ్చిన ప్రతి అనుభవాన్ని పేర్చుకుంటూ తన వ్యక్తిత్వాన్ని దిద్దుకోవడం జరిగింది. ఇప్పటికీ మనం ఆయన జీవిత గమనాన్ని చదువుకునేటట్టు చేసింది ఇదే.

## కొన్ని నిర్వచనాలు

గాంధీజీ ప్రజాస్వామ్యం గురించి చెప్తూ, "నా ఉద్దేశ్యంలో అత్యంత బలహీనుడైన పౌరుడు కూడా అన్ని అవకాశాలు గల ఉన్నతస్థాయి పౌరునితో సరిసమానంగా

జీవించడమే నిజమైన ప్రజాస్వామ్యం" అన్నారు. ఈ ఒక్క నిర్వచనంలో గాంధీ సునిశితమైన దృష్టి, విభేదాలకు తావులేని స్పష్టత కనబడతాయి.

"ప్రతీకారమే అవలంబించి, కన్ను పొడిచిన వారి కన్ను తిరిగి పొడవడమే సమాధానమైతే, ప్రపంచమంతా ఏనాడో గుడ్డిదై పోయి ఉండేది. క్షమతోనే కఠిన పాషాణ హృదయం గల వారిలోని దైవత్వాన్ని, సత్యాన్ని మేలుకొలపాలి" అంటూ చంటి బిడ్డకు సైతం అర్థమయ్యేటంత సులభంగా అహింసను గురించి చెప్పడం ఆయనకు గల దృక్కోణాన్ని తెలుపుతుంది.

"విద్య అంటే ఎవరికైనా సరే (వయసుతో నిమిత్తం లేకుండా) దేహదారుఢ్యత, మనోధైర్యం, మేధాశక్తి పెంచగలిగే ఒక కార్యక్రమం."

స్వార్థం గురించి ప్రస్తావిస్తూ, "ఒక వ్యక్తి తనను గురించి తాను ఎక్కువగా ఆలోచించుకుంటూ, స్వార్థంతో ఉన్నప్పుడు ఒకే ప్రశ్న వేసుకోవాలి. 'నేను చేస్తున్న పని అత్యంత బలహీనునికి, బడుగు వర్గానికి చెందిన జీవితాలను ఏ కాస్తయినా మెరుగు పరచగలదా? అని. అలా కాని ఏ కార్యక్రమమైనా నిరర్ధకమే." అని చెప్పారు గాంధీజీ.

## సత్యం- అహింస

"సత్యం చెప్పడం, సత్యం కోసం నిలబడడం అన్నిటికన్న కష్టం. సత్యమే దైవం. అహింసయే అతి బలమైన ఆయుధం" అని గాంధీ చెప్పారు.

ఏ ఒక్క హింసాత్మక సంఘటన జరిగినా గాంధీ మొత్తం ఉద్యమం ఆపేసేవారు. చౌరీచౌరాలో పోలీసుస్టేషన్‌ను ప్రజలు ముట్టడించినందుకు గాంధీ చాల మథనపడ్డారు. "ఈ దేశం అహింసాయుత పోరాటం చేయగల పరిణతిని ఇంకా పొందాల్సి ఉంది" అంటూ ఉద్యమాన్ని తాత్కాలికంగా నిలిపివేసిన నాయకుడు గాంధీ. క్రమశిక్షణ వ్యక్తిలోనే కాక సమూహంలోని ప్రతి వ్యక్తిలో ఉండాలన్నదే గాంధీ ధ్యేయం.

## దినచర్యపై పుస్తకాల ప్రభావం

గాంధీజీ డేవిడ్ థోరోను గురించి చదివాక నిరాడంబర ఆశ్రమ జీవనమే పెరుగుతున్న ధనదాహానికి, జరుగుతున్న శ్రమదోపిడికి విరుగుడు అని గట్టిగా నిర్ణయించుకున్నాడు. ఎడ్విన్ ఆర్నాల్డ్ రచించిన 'సాంగ్ సెలెస్టియల్', 'కొత్త నిబంధన-

బైబిల్', 'కార్ లైట్ హీరోస్' , మహమ్మదు ప్రవక్తను గురించిన గ్రంథాలను చదివి, సత్పురుషులంతా సత్యం, అహింస, నిరాడంబర జీవనం అనేవి ముఖ్య లక్షణాలుగా కలిగి ఉన్నారని అర్థం చేసుకున్నాడు.

టాల్‌స్టాయ్ వ్రాసిన 'ది కింగ్‌డమ్ ఆఫ్ గాడ్ ఈజ్ వితిన్ యు' (నీలోనే దేవుని రాజ్యం ఉంది) అనే పుస్తకం చదివాక, ఒక వ్యక్తి తనకు గల సంపదను కనీస అవసరాలకు మించి కలిగి ఉండడం సామాజిక నేరమని భావించడం మొదలుపెట్టాడు. ఆఫ్రికాలో నాప్టాల్ పర్యటనకు వెళ్లినప్పుడు రస్కిన్ రచించిన 'అన్ టుది లాస్ట్' పుస్తకం తన జీవితాన్ని ఒక మలుపు తిప్పిందని, ఆ గ్రంధంలో ఉన్న విషయాలను బట్టి తాను 'సర్వోదయ' మార్గాన్ని ఎంచుకున్నానని తరచూ చెప్తూ ఉంటారు గాంధీజీ.

## సత్యాగ్రహ ఉద్యమాలు

గాంధీజీ దక్షిణ ఆఫ్రికాలో మొట్టమొదటిసారిగా వర్ణ వివక్షపై తిరుగుబాటు లేవనెత్తాడు. భారతీయులను వలస పౌరులుగా గుర్తించాలని ఉద్యమాన్ని మొదలు పెట్టాడు. "సత్యాగ్రహమంటే నిర్భీతి. ఎవరు ఎదురు వచ్చినా, శారీరక హింస, మరణం తప్పదని తెలిసినా నమ్మిన సిద్ధాంతం కోసమే కృషి చేయాలి" అని చెప్పిన గాంధీ మాటల వలన ఉత్తేజితులై ఆయన అనుయాయులు కొత్త మానసిక శక్తి గలవారయ్యారు. ఆ తరువాత, 'భారతీయుల వివాహాన్ని గుర్తించబోము, చర్చిలో ప్రతి జంట నమోదు చేసుకోవాల్సినదే' అని ప్రకటించిన ప్రభుత్వ నిర్ణయాన్ని కూడా నిరసిస్తూ పోరాటం చేశాడు. ఈ రెండు ఉద్యమాల సమయంలో, భారతదేశంలో పలుప్రాంతాల నుండి వచ్చిన వలస కార్మికులతో కలసి మెలసి పనిచేయడం వల్ల అందరితో చర్చలు జరపడం ఆయనకు అలవాటైంది.

## తొలి విజయం

ప్రపంచంలో ముందెన్నడూ జరగని ' సత్యాగ్రహం' అనే ఉద్యమపు బీజాలు ఈ సమయంలోనే నాటబడ్డాయి. ఆనాడు, లూయిస్ ఫిషర్ అనే పాత్రికేయుడు, "మొట్టమొదటిసారిగా బ్రిటిష్ సామ్రాజ్యం బీటలు వారింది. వారి పెత్తనం, అధికార దర్పం, సైన్యం, చట్టాలు, తుపాకులు అన్నీ ఒక్కసారిగా మ్రాన్పడిపోయాయి. తాము నమ్మిన సిద్ధాంతం కోసం సత్యాగ్రహులంతా వరుసగా దెబ్బలు తిని, వారి ఆడవారిచే సేవలు పొందుతూ, తమ నిరసనను కొనసాగించారు." అని ప్రత్యక్ష వార్తాకథనం చెప్పడం జరిగింది. ఇది మానవ చరిత్రలో ఒక కొత్త అధ్యాయాన్ని లిఖించింది.

## స్వదేశానికి తిరిగి రాక

గాంధీ, కాంగ్రెస్ కోటరీలో పేరుకుపోయిన వర్గ విభేదాలు, ధనికుల సుఖ లాలసత్వం, ఉపన్యాసాలలో నీతులను వల్లిస్తూ నిజజీవితంలో పాటించని వారి డొల్లతనం అనే వాటిని ఎండగట్టాడు. ఎవరి పని వారే చేసుకోవాలి, చదువంటే పరాయి భాష చదివి, సామాన్య ప్రజానీకానికి దూరంగా బ్రతకడం కాదు, విదేశీ పాలన వల్ల నాశనమైన మన దేశ సామాజిక, ఆర్థిక వ్యవస్థలనీ, గ్రామ స్థాయినుంచి దేశాన్ని పునర్నిర్మించాలని ఉద్ఘాటించాడు. రైతుల శిస్తు విధానం, చేనేత కార్మికుల ఇక్కట్లు, స్త్రీల వెనుకబాటుతనం ఇవే అసలు సమస్యలని స్పష్టంగా తెలియచేసి ఒక కొత్త ఆలోచనను మొదలు పెట్టాడు.

## నాటి యువతపై గాంధీ ప్రభావం

గాంధీ సభలో మాట్లాడితే నిజాలను బహిర్గతం చేసి, ఏ విధానంలోని లోపాలనైనా కుండబద్దలు కొట్టినట్టుగా నిర్మొహమాటంగా, తక్కువ పదాలతో, సూటిగా చెప్పడం విని, చూసి భారత ప్రజలు వేలసంఖ్యలో ఆయన వెనుక చేరారు. “ఉన్నత విద్య చదివి, పెద్ద పెద్ద ఉద్యోగాలు చేస్తున్న సంపన్న కుటుంబీకులు, నవయువకులు ఇన్నాళ్ళకు నిర్దిష్టమైన దృక్పథం గల నాయకుడు వచ్చాడని సమ్మోహితులై గాంధీ పథాన్ని అనుసరించారు” అని జవహర్లాల్ నెహ్రూ చెప్పారు. స్వాతంత్ర్య పోరాటంలో మితవాదధోరణికి స్వస్తిచెప్పి, సంపూర్ణ స్వరాజ్యం కోసం పనిచేయాలని గాంధీ ప్రకటించారు.

గాంధీజీ, ‘భారతదేశం ఉద్యమించాలంటే ఈ దేశపు స్త్రీ శక్తి కూడా కలిసి రావాలి’ అని బోధ పరచి, సాంప్రదాయం ముసుగులో మహిళలను పరిమితం చేయడం కుదరదంటూ, భార్య కస్తూరిబాను ఆదర్శప్రాయంగా స్వాతంత్ర్య పోరాటంలోకి దింపారు.

### సహాయ నిరాకరణోద్యమం

గాంధీ చేసిన చంపారన్ సత్యాగ్రహం, ఖేడా సత్యాగ్రహం, అహమ్మదాబాదు బట్టలమిల్లు శ్రామికుల సత్యాగ్రహం అన్నీ అహింస, సహాయ నిరాకరణలను పరమోన్నత ఉద్యమ సూత్రాలుగా నిలబెట్టాయి.

తొలిసారిగా అహ్మదాబాదు మిల్లు శ్రామికుల కోసం చేసిన సత్యాగ్రహంలో ఇరవై ఒక్క రోజుల నిరసన తరువాత అశాంతితో రగిలి పోతున్న సమ్మెకారులకు మద్దతుగా, నిరాహార దీక్ష చేపట్టి గాంధీజీ సంచలనం సృష్టించాడు. 'యంగ్ ఇండియా' అనే పత్రికను నడుపుతూ, యావత్ భారతదేశ ప్రజానీకంతో నిత్యం సంభాషించేవారు.

ఉద్యమం కోసం విరాళాలను కోరడం తాము అనుకున్న పైకం పోగుపడిన తరువాత 'ఇక విరాళాలు చాలంటూ' వచ్చిన సొమ్మును తిరిగి పంపించడం ఏ దేశ చరిత్రలోనూ జరగనంతటి పారదర్శకమైన మహోద్యమ లక్షణంగా చెప్పుకోవచ్చు.

## గాంధీ మార్గం

సబర్మతి ఆశ్రమం స్థాపించి నిరాడంబరమైన జీవితం గడుపుతూ ధూమపానం, మద్యపానంలకు దూరంగా జీవించడమనే విజయవంతమైన సామూహిక ప్రయోగం సాధ్యమేనని గాంధీజీ నిరూపించారు. పరిసరాల పరిశుభ్రత, శాకాహారం, ప్రార్థనతో మనసును శుభ్రపరచుకోవడం, విదేశీ వస్తువుల బహిష్కరణ దేశవ్యాప్తంగా గాంధీజీ ప్రవేశపెట్టిన కార్యక్రమాలు. వీటిని చూసి సామాన్యులతో పాటు మేధావులు సైతం నివ్వెరపోయారు.

ఆయన దేనినైతే చెప్పారో దాన్ని అవలంబిస్తూ సంవత్సరాల కొలదీ తన జీవితాన్ని తెరచిన పుస్తకంగా గడపడం వల్ల ఆకర్షితులై, యువకులంతా అదే మార్గాన్ని ఎంచుకుని జీవించేలాచేశాయి.

'దండి సత్యాగ్రహం' ప్రపంచంలోని అన్ని ఉద్యమాలలో శ్రేష్టంగా పేర్కొనదగ్గ ప్రాముఖ్యతను సంతరించుకుంది. రోజూ ఉపయోగించే ఉప్పు కోసం పన్నులు ఉల్లంఘించేందుకు 241 మైళ్ళు నడిచి వెళ్లడం గాంధీజీ చేసిన అత్యంత సాహసోపేతమైన ఉద్యమం. దీనికి తగ్గట్టుగానే లక్షల కొలది సామాన్య పౌరులు జన సముద్రమై వెల్లువెత్తడం ఆనాటి ప్రపంచ సంఘటనలలో అత్యుత్తమంగా నిలిచింది.

చరఖాతో నూలు వడికి, ఖద్దరు దుస్తులు ఉపయోగించడం వల్ల స్వదేశీ పరిశ్రమలను ప్రోత్సహించాలి. "ఖద్దరు ధరించడం గర్వపడే విషయం" అని ఆయన ప్రకటించారు. ఎన్నో కుటుంబాల్లో స్త్రీ పురుషులు ఖద్దరు ధరించడం స్వాతంత్ర్య సమరంలో భాగంగా పరిగణించారు. బ్రిటిషువారి బట్టల మిల్లులలో తయారైన విదేశీ వస్త్రం బహిష్కరణతో శాంతియుతమైన విప్లవం వెల్లువెత్తింది.

రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో, రాజకీయ శత్రువైన బ్రిటిష్ వారితో యుద్ధంలో పాల్గొనేందుకు సైనికులుగా భారతదేశ పౌరులను పంపడం ఆయన సహనానికి, శాంతానికి, అహింసాయుత ఆలోచనలకు తలమానికం వంటిది. అప్పట్లో ఇది వివాదాస్పదం అయినప్పటికీ క్రైస్తవంలో చెప్పిన 'ఒక చెంప కొడితే మరో చెంప చూపమని' చెప్పిన ప్రవచనమే తన నిర్ణయానికి మూలం అని చెప్పి గాంధీ అందరినీ విస్మయపరిచారు.

## రచనలు ఉద్యమం

గాంధీ తన స్వీయచరిత్రను "సత్యంతో నా ప్రయోగాలు" పుస్తకరూపంలో వ్రాసారు. ప్రపంచంలో లెక్కకు మిక్కిలిగా అమ్ముడుబోతున్న గ్రంథాలలో అది ఒకటి. తన జీవితంలోని తప్పులను, బలహీన క్షణాలను బాహాటంగా వ్రాసి ఎవరూ ఎప్పటికీ చేరుకోలేని ఆదర్శంగా నిలిచారు. "కీ టు హెల్త్" అని ఆరోగ్యసూత్రాలను క్రమబద్ధీకరించి ఒక పుస్తకం అందించారు. గాంధీ వంటి బలమైన పాత్రికేయులు అరుదు. యంగ్ ఇండియా ఆయన నడిపిన వార్తాపత్రిక.

ప్రపంచ యుద్ధ సమయంలో, సంక్షోభ పరిస్థితుల్లో ఇంకా ఆలస్యం చేస్తున్న బ్రిటిష్ ప్రభుత్వంపై 'క్విట్ ఇండియా' అనే వజ్రాయుధాన్ని ప్రయోగించారు గాంధీజీ. హిందూ ముస్లిం ఐక్యత కోసం త్రికరణ శుద్ధిగా కృషి చేశారు. దేశ విభజన సమయంలో స్వాతంత్ర్య సంబరాలను బహిష్కరించి, శాంతి సాధనకు హింసను నిరోధించడానికి, నిర్భయంగా అల్లరి మూకల మధ్యకు వెళ్లి, ప్రాణాల్ని లెక్క చేయని మొండివాడుగా 70 ఏళ్ళు దాటిన వృద్ధ ఉద్యమకారుడు గాంధీజీ. ఆయన ఓడిపోయాడా? గెలిచాడా ? ఎవరికీ అంతుపట్టదు. తన కుటుంబ సభ్యులను, ఏనాడూ ప్రత్యేక హోదాతో చూడని నిష్కళంక నేత అతడు.

శాంతి స్థాపన కోసం, ప్రజలంతా ఏకతాటిపై ఉండాలన్న ఆకాంక్షతో, ప్రార్థన చేస్తూ, ఆందోళనకారుల ఆగ్రహానికి గురై, అంతిమ క్షణాలలో రామనామ స్మరణతో నేలకొరిగిన అసాధారణ వ్యక్తి గాంధీజీ.

గాంధీ మరణించిన తరువాత, ఆయన సూత్రాలైన సత్యాహింసలు బలహీనమైన ప్రజా సమూహాలు అణచివేతకు గురైన ప్రజలు ఏ దేశంలోనైనా సరే పాటించగల పోరుబాట అయ్యాయి. మార్టిన్ లూథర్ కింగ్, నెల్సన్ మండేలా, సూకి, వంటి

ఎందరో నాయకులు సత్యము– అహింస పాటించి విజయాన్ని సాధించిన వారే.

## నేటికీ గాంధీమార్గం

గాంధీ జీవితం ఆధునిక ప్రపంచంలో యువతను విశేషంగా ఆకర్షించడంలో కృతకృత్యమైంది. కుల, మత, వర్గ, లింగ ఆర్థిక భేదాలను మరచి, నిరాడంబరంగా, తోటివారి శ్రేయస్సును కోరుకోగల ఉన్నతమైన వ్యక్తిత్వం ఈనాటి మంత్రమైంది.

సంపదలను కాదని అతి తక్కువ వస్తువులతో ప్రకృతికి దగ్గరగా– పర్యావరణానికి కీడు చేయకుండా, సహనంతో, శాంతంగా గడిపే జీవన విధానం 'మినిమలిజం' గా పేరు తెచ్చుకుంది. గాంధీ ఆకాంక్షించిన స్త్రీ– పురుష సమానత్వం, గ్రామ స్వరాజ్యం, కుటీర పరిశ్రమల ప్రోత్సాహం గమ్యాలను ఇంకా చేరుకోవాల్సి ఉంది.

గాంధీజీ జీవితం ఒక సజీవప్రయోగంగా, ఒక ప్రత్యేకమైన అధ్యాయంగా ఎప్పటికీ స్ఫూర్తిని అందిస్తూనే ఉంటుంది.



# పిల్లలను సాకేదెలా?

"నేటి బాలలే రేపటి పౌరులు" అనే వాక్యం బాధ్యతను గుర్తుచేసే నినాదం. అది పాతపాటగా కాక సరికొత్త పల్లవి కావాల్సి ఉంది. ఒక దేశం భవిత పిల్లల పెంపకం, పోషణపైన ఆధారపడి ఉంటుంది. ఈ దిశగా గాంధీజీ కొన్ని బృహత్తర ప్రణాళికలు రూపొందించారు.

తలిదండ్రులు తమ బిడ్డలకు ఇవ్వవలసినది ప్రేమానురాగాలు మాత్రమే కాదు. వాటితో పాటు బాధ్యత, నిజాయితీ కూడా అని మహాత్మాగాంధీ పదే పదే చెప్తూ ఉండేవారు. భారతీయసంస్కృతిలో పాతుకుపోయిన కొన్ని మూర్ఖమైన ఆచార వ్యవహారాలను సమూలంగా పెరికి వేసి, కొత్తతరాన్ని తయారు చేయకపోతే సంఘ భవిష్యత్తు ప్రమాదంలో పడుతుందని ఆయన భావన. స్వాతంత్ర్యం లభించేసరికి మన దేశం సంఘ పునర్నిర్మాణ ప్రణాళికతో సిద్ధంగా ఉండాలని గాంధీజీ అభిలాష.

గాంధీజీ పిల్లలను సత్యాహింసలకు మౌన ఆరాధకులుగా పరిగణించేవారు. అమాయకత్వం ,క్షమ, ఎవరితోనైనా కలిసిపోగల వారి మానసిక స్వచ్ఛత, తనను విస్మయపరుస్తాయని ఆయన చెప్పేవారు. చెప్పినది విని ఆచరించడం వారి ప్రభావాత్మక వయసులో సహజంగానే ఉంటుంది. కనుక, బాలలకు ఆదర్శప్రాయమైన విలువలను చెప్పవలసిన బాధ్యత పెద్దవారిదే అంటారాయన.

నవజీవన్ 24, నవంబరు, 1929 లో ఆయన ఇలా వ్రాసారు."మనం కూడా పిల్లల్లా నిష్పక్షపాతంగా ఆలోచించగలిగితే సమస్యలు, భేదాభిప్రాయాలు అసలు పుట్టనే పుట్టవు. నిజానికి మనం ఆలోచనలోగాని, ఆచరణలోగాని వారిలా కలసిపోగల లక్షణం అలవరచుకోవడం, అసాధ్యమే. అయినా దానికోసం ప్రయత్నించాల్సి ఉంది."

పిల్లల పెంపకం గురించి గాంధీజీకి కొన్ని స్థిరమైన అభిప్రాయాలు ఉన్నాయి. ఆయన తన ఆత్మకథలో, వ్యాసాలలో తరచు ఈ అంశంపై లోతుగా చర్చించారు. భార్యాభర్తలు పిల్లలను కని, పెంచడానికి తగు పరిణితి కలిగిఉండాలి.

ఆ అంకిత భావం లేనప్పుడు పిల్లల్ని కనకూడదని చెప్పేవారు. గాంధీజీ అన్న ఈ మాట ఎంత విప్లవాత్మకమైనదో. "బోలెడు జనాభా ఉన్న భారతదేశంలో, అందరూ పెళ్లిచేసుకుని పిల్లల్ని కనవలసిన అవసరమే లేద"ను కున్నారాయన. ఇది కూడ వింతగా అనిపించినా ఆలోచించవలసిన విషయం.

పిల్లలను పెంచడంలో పరిసరాల, వ్యక్తిగత పరిశుభ్రత అనేవి వ్యాధులను రాకుండా చూడగలగడంతో సమానం అన్నారాయన. ముఖ్యంగా తల్లి, తన బిడ్డలను సాకేటప్పుడు వారిలో  వచ్చే శారీరక, మానసిక మార్పులకు అనుగుణంగా వారిని పెంచగల సామర్థ్యం కలిగి ఉండాలని గాంధీజీ చెప్పారు. పిల్లల మలమూత్రాలను శుభ్రం చేయటం, స్నానం చేయించడం, వారు ఆడుకునే వస్తువులను శుభ్రంగా ఉంచడం, ఉతికిన బట్టలను వేసి, ఎప్పటికప్పుడు గోళ్లను తీయడం, జుట్టును శుభ్రంగా ఉంచటం, పిల్లలు తినే ఆహారాన్ని తాజాగా తయారు చేయడం ఇవన్నీ తల్లికిగల ముఖ్యమైన బాధ్యతలని చెప్పేవారాయన. ఈ పనులన్నింటినీ సజావుగా జరపడానికి తండ్రి అన్ని విధాలుగా ఆమెకు తోడుగా ఉండాలని ఆయన స్పష్టంగా చెప్పేవారు. బిడ్డల ఆరోగ్యం గూర్చి వివరిస్తూ దంతధావనం సరైన పద్ధతిలో, సరైన సమయం పాటు జరిపేలా  తల్లి బిడ్డలను పర్యవేక్షించాలని చెప్పేవారు.

పిల్లల పెంపకంలో పౌష్టికాహారం అనే అంశానికి ఈయవలసిన ఆవశ్యకతను గురించి గాంధీజీ ఎన్నో వందల పుటలు వ్రాయడం చూస్తే ఆయనకు గల శ్రద్ధ తెలుస్తుంది. గాంధీజీ ఒక తల్లి హృదయంతో పని చేసారనిపిస్తుంది. పిల్లలకు ఆకుకూరలు,కాయగూరలతో ఉన్న భోజనమే మొదటి నుంచి అలవాటు చేయాలని గాంధీ నొక్కి వక్కాణించారు. కాఫీ, టీ ద్రవాలకు బదులుగా పళ్లరసాలను ఇవ్వాలని ఆయన సూచించేవారు పంచదారకు బదులు బెల్లం వాడాలని,ఆహారంలో ఎక్కువగా పిండిపదార్థాలు  ఉండకూడదని,సమతుల  ఆహారంలో  చిరుధాన్యాలు,  పప్పులు, వేరుశెనగ, చిక్కుడు జాతి కాయగూరలు  అనుదినం వారి ఆహారంలో తప్పక చోటు చేసుకోవాలని చెప్పేవారు.

ఏ కాలంలో దొరికే పండ్లు ఆ కాలంలో తినడం వలన ఏడాది కంతా సరిపడా విటమిన్లు, లవణాలు దొరుకుతాయని ,ఆయన చెప్పేవారు.తల్లి తన బిడ్డకు ఖర్జూర, జామ, అంజూర్ వంటి పండ్లను అలవాటు చేయాలని చెప్పేవారు.

బిడ్డలను సాకేటప్పుడు తల్లిదండ్రులిద్దరూ బాధ్యతగా ప్రవర్తించాలని, తండ్రి ధూమపానం, మద్యపానంలకు దూరంగా ఉండి, బిడ్డను సంరక్షించడంలో, పెంచడంలో తల్లికి చేదోడు వాదోడుగా ఉండాలని గాంధీజీ చెప్పేవారు.

సంయమనం, సహనం, ఓర్పు లేని తల్లిదండ్రులు తమ పిల్లలకు మంచి ఉదాహరణలు కాలేరు కనుక, పిల్లల శారీరక, మానసిక ఆరోగ్యానికి తల్లిదండ్రులే పునాది వేసే బాధ్యత తీసుకోవడం అత్యంత ముఖ్యం అని గాంధీజీ అభిప్రాయం. ఇది ఎంత సత్యమో మానసిక శాస్త్రవేత్తల పరిశోధనలో వెల్లడైనదే కదా!

ఇప్పటి వరకు, బిడ్డల ఆరోగ్యం గురించి చెప్పాడు, వారి మానసిక అభివృద్ధికి గాంధీజీ ఏం చెప్పారో పరిశీలిస్తే ఆశ్చర్యంగా ఉంటుంది.

భారతదేశంలో అనాదిగా మగ బిడ్డ అంటే ఎక్కువ, ఆడపిల్ల పుడితే తక్కువ అనుకోవడం చాల పెద్ద తప్పని ఆయన తీవ్రంగా ఖండించారు. కుల, వర్ణ, వర్గ,మత విభేదాలంటే గాంధీజీకి చాలా వ్యతిరేక భావం ఉండేది. అంటరానితనం అమానుషమని, పిల్లలలో మానసిక అడ్డుగోడలు లేకుండా ఉండాలంటే తల్లిదండ్రులు తమ పిల్లలను పెంచే విధానంలోనే సమానత్వ ధోరణి ఉండాలని ఆయన నమ్మేవారు.

"పిల్లలకు ఆరు సంవత్సరాల వయసు వచ్చేదాకా ఎటువంటి పుస్తకాల అవసరం లేదు. వాళ్లను పెంచే తల్లిదండ్రులకు, ఉపాధ్యాయులకు బిడ్డల పెంపకం గురించి సూచనలతో పుస్తకాలు అవసరమౌతాయి" అంటారాయన. పిల్లలు చాలా సున్నిత మనస్కులు. వారిలో పరిసరాలను గమనించే పద్ధతి ఉంటుంది. కనుక వారిని పెంచేటప్పుడు పెద్దవారు మెలకువగా, ఉండాలని గాంధీ చెప్పేవారు. మతం అనేది కుటుంబానికి సంబంధించిన విషయమే తప్ప, ఉపాధ్యాయుడు చెప్పే విషయం కాదని కూడా గాంధీ అభిప్రాయం.

ఒక వ్యక్తిని గురించి ఆదర్శప్రాయుడు అని చెప్పే బదులు, వారెలా ఆదర్శప్రాయులయ్యారో, వారి నడవడిక లోని గొప్ప గుణాలేమిటో చెప్పాలి తప్ప, ఎవరో ఒక మనిషిని మరీ ఉన్నతంగా చిత్రించ కూడదని చెప్పేవారు. అలా చేస్తే వ్యక్తిగత ఆకర్షణ (Hero Worship )పెరిగిపోతుందని ఆయన ప్రగాఢ విశ్వాసం. ఇది బానిసత్వ ధోరణికి నాంది అని గాంధీజీ అభిప్రాయం. ఈనాడు ఈ సత్యం ఎంత అవసరమో గమనార్హం.

పిల్లలు నిర్భయంగా నిజాన్ని చెప్పగలరని, ఈ గుణాన్ని వారిలో పెంపొందించడానికి ఉద్దేశపూర్వకంగా పెద్దలు ప్రయత్నం చేయాలని గాంధీ చెప్పేవారు. కుటుంబం, పాఠశాల అనే రెండు చోట్ల సత్యం, నిజాయితీలకు బీజాలు పడాలి. నిజం చెప్పే పిల్లలను అన్ని విధాలుగా మెచ్చుకునే వాతావరణాన్ని పిల్లలకు కల్పించాలి. (గాంధీజీ సమగ్ర రచనలు vol .39to 41 సంపుటాలు)

గాంధీ దక్షిణ ఆఫ్రికాలో టాల్‌స్టాయ్ ఆశ్రమం నెలకొల్పిన సమయం నుంచి తన పిల్లల పెంపకంపై శ్రద్ధ వహించడం ఆయన నిబద్ధతకు తార్కాణం. సామాన్య గృహస్థు గానే తప్ప, ధనవంతుడైన వకీలు బిడ్డలుగా ఆయన వారిని ఎన్నడూ పెంచలేదు. శారీరక శ్రమ, నడక, వ్యాయామం, ఇంటి పనులు, ఆశ్రమవాసులతో సహజీవనం ఇవన్నీ తన బిడ్డలకు అలవరిచారు. బడికి, ఆశ్రమానికి తన బిడ్డలతో పాటుగా నడిచి వెళ్ళివస్తూ, ఒక స్నేహితుని వలే మసలుకునేవారు.

“నాకు ఆరోగ్యం పట్ల గల అవగాహన నా పిల్లల పెంపకంపై చక్కని ప్రభావం చూపింది” అని ఆయన చెప్పేవారు. బాగా చిన్న వయసులో పెళ్లి కావటం వల్ల తన పెద్ద కొడుకును పెంచడం అవగాహనా లోపంతో జరిగిందని ఆయన ఒప్పుకున్నారు కూడా.

బిడ్డ పుట్టిన ఏడాది, రెండేళ్ళకే ప్రీ స్కూల్ అంటూ తలిదండ్రులకు దూరంగా పెంచడం, విలాసవంతమైన జీవన విధానం అలవాటు చేయడం, శారీరక శ్రమ, ఆటలు లేని పాఠశాల స్థాయి విద్య, యువతరం భయంకరమైన మాదకద్రవ్యాలకు బానిసలైపోతున్న ఆధునిక పోకడల నడుమ, గాంధీ ఆలోచనాసరళి నేడు ప్రతి జంటకూ అనుసరణీయం.

బిడ్డల పెంపకం అంటే ఖరీదైన వస్తువులను అందుబాటులో ఉంచడం కాదు, వారికి ఊహ వచ్చి, వ్యక్తత తెలిసేవరకూ తోడుగా ఉండడం అని ఆధునిక యువ దంపతులు గుర్తించాలి.



# బోధనతో సాధన

బడికి వెళ్ళడం, చదువుకోవడం రెండూ ఒకటేనా?విద్యార్థి అంటే పట్టా సాధించడం కోసం శిక్షణ ఇవ్వబడుతున్న తోలుబొమ్మా? మనం కొన్ని ప్రశ్నలు, వాటి సమాధానాలు నిర్మొహమాటంగా చర్చించుకోవాల్సిన సమయం వచ్చింది.

అలనాటి స్వాతంత్ర్య పోరాటంలో రాజకీయ పరిస్థితుల గురించి మాత్రమే మన నాయకులు ఆలోచించారా?ఈ దేశపు విద్యావ్యవస్థ గురించిన ప్రస్తావన వచ్చిందా? సత్యమేమిటంటే సుదీర్ఘ పోరాట సమయంలో, నవ సమాజం నిర్మాణం, కొత్త తరంకై విద్యా విధానం రూపొందించడంలో కూడా ఆ నాయకులు తపనపడ్డారు. సహాయనిరాకరణ ఉద్యమంతో పాటు కొన్ని బృహత్తర ప్రణాళికలు, వాటి ప్రయోగాత్మక కార్యక్రమాలు జరిపారు.

మహాత్మాగాంధీతో పాటు కాకాసాహెబ్ కాలేల్కర్, రాజగోపాలాచారి, జె.బి. కృపలానీ, జాకీర్ హుస్సేన్, వినోబాభావే, ఆర్య నాయకం, శాంతిదేవి, కె ఎస్ ఆచార్యులు– వంటి ఎందరో ఉత్సాహవంతులైన నాయకులంతా కలిసి రూపుదిద్దిన "నయీ తాలీం"– (నూతన విద్య) అనే ఒక విశిష్ట ప్రయోగం గురించి మనం ఇప్పుడు తెలుసుకుందాం.

ఈ నూతన విద్యలో మూడు దశలను పేర్కొన్నారు:

## 1. మౌలిక విద్య లేదా బేసిక్ ఎడ్యుకేషన్

విద్యార్థి 7– 14 సంవత్సరాల వయసు వచ్చే వరకూ ఈ బోధన జరుగుతుంది. ఇందులో విద్యాబోధన పుస్తకం నుంచి కాక వృత్తి పని, ఏదైనా చేతిపనిని నేర్పిస్తూ, చిత్రలేఖనం, సంగీతం వంటి ఏదో ఒక కళను కూడా బోధిస్తారు. ఈ పనిని నేర్పడానికి మాత్రమే బోధనాభాషగా మాతృభాష ఉంటుంది.

## 2.పూర్వ మౌలిక విద్య లేదా ప్రీ బేసిక్ ఎడ్యుకేషన్

ఇది బిడ్డ పుట్టినప్పటి నుంచి ఏడేళ్ల వరకు తల్లిదండ్రులు వారిని పెంచుతూ, తొలినాటి శారీరక, మానసిక, భావాల ఎదుగుదలకు బీజాలను నాటడం. కుటుంబ

వ్యవస్థ సక్రమంగా పనిచేస్తేనే సత్ప్రవర్తన, సరైన వ్యక్తిత్వం రూపుదిద్దుకుంటాయని గాంధీజీ బలంగా నమ్మే వారు. శాస్త్రీయమైన ఆలోచన లేని తల్లిదండ్రుల పిల్లలు విద్యాసముపార్జనలో వెనుకబడతారు కనుక, అలాంటి తల్లిదండ్రులకు వయోజనవిద్యను అందించాలని గాంధీ భావించేవారు.

## 3. ఉత్తర మౌలిక లేదా పోస్ట్ బేసిక్ విద్య

ఈనాటి కళాశాల, విశ్వవిద్యాలయ చదువులకు బదులుగా 14 సంవత్సరాల పైబడిన విద్యార్థులకు నాలుగు సంవత్సరాల పాటు తమకు నచ్చిన అంశంలో, లోతుగా అధ్యయనం చేసే అవకాశం, ఇందులో గ్రంధపఠనం, పరిశోధన ఉంటాయి. చూడడానికి చాలా సరళంగా కనబడుతున్న ఈ విద్యావిధానంలో ప్రత్యేకమైన అంశాలున్నాయి.

అవేమిటంటే...

### విద్య

మొత్తంగా విద్య గ్రామస్థాయి లోనే జరుగుతుంది. ఉపాధ్యాయులు ఎప్పుడూ విద్యార్థుల దగ్గర ఉంటారు. పరిసరాల పరిశుభ్రత, పశువుల పెంపకం, అక్కడి నైసర్గిక పరిస్థితులకు అనువుగా ఉండే కుటీర పరిశ్రమల నిర్వహణ, హస్తకళారూపాల తయారీ, నూలు వడకడం చేస్తూ పిల్లలతో సన్నిహితంగా ఉంటూ విద్యాబోధన చేయటం. ఇదొక గ్రామస్థాయి జీవన విధానం.

### వనరులు

వనరులు పైకం రూపంలో ఉండేది కాదు. భూ, శ్రమదానం, వివక్ష లేకుండా బ్రతకగల మానసిక పరిణితి ఉండాలని ఒక ప్రాధమిక నియమం. కుల, మత, వర్గ, లింగ, వయోభేదాలు లేకుండా ప్రతి వ్యక్తి సహాయ సహకారాలతో, ఆత్మగౌరవంతో, ఒకరిపట్ల మరొకరు గౌరవం, ప్రేమలతో కలసికట్టుగా పనిచేయడమే ఈ విద్యావిధానంలోని సూత్రం.

### ప్రభుత్వం

ప్రభుత్వం చేయవలసినదల్లా గ్రామ పరిపాలనలో భాగస్వామ్యం తీసుకోవడం, తయారుచేయబడిన వస్తువులను కొనుగోలు చేయడం, అంతే.

మద్యం అమ్మడం ద్వారా వచ్చే సొమ్మును విద్య కోసం ఖర్చు పెట్టడానికి

గాంధీజీ వ్యతిరేకతను చూపేవారు. దీనికన్నా సంపన్న కుటుంబాల వారి, వితరణతో భూమిని, పశువులను, విద్యార్థుల కోసం కేటాయించడమే మేలు అని చెప్పేవారు.

నయీతాలీం ఆశయాలు ఏమిటి?

విద్యార్థులను మోసం, కపటం, స్వార్థాలకు దూరంగా సత్యం –సహకారం –శాంతి ఉండేలా, ఎదిగిన తోటలోని మొక్కల లాగ స్వేచ్ఛగా, నిష్పాక్షికంగా పెంచాలి. మౌలికంగా అమ్మ పెంచే వ్యవస్థ నుండి దేశస్థాయి వరకు విద్యార్థులు పక్క వారితో కలసి పని చేయగలగాలి. హింస, అసత్యం, రెండూ కూడా సంఘవిద్రోహ కార్యక్రమాలకు దారితీస్తాయన్న విషయం పిల్లలు, పెద్దలు గ్రహించడం అత్యంత అవసరం.

మౌలికావసరాల నుండి బహుళ ప్రయోజనాల వరకూ, పరిశ్రమ స్థాపనతో ప్రాంతీయ సహజ వనరుల వినియోగం వరకు అన్నీ గ్రామస్థాయిలో కలసికట్టుగా, అక్కడి గ్రామాల ప్రజలందరూ కలసి సాధించాలి. జీవితం అంటే శారీరక శ్రమ లేని యంత్రాల వినియోగించటం వల్ల వచ్చే కాలయాపన కాదని తెలుసుకోవాలి. "మద్యం మత్తు, ఉన్నత విద్య చదువుకున్న తరువాత భోగాల నిషాలో ఉండడం ఒకటే" అని రాజాజీ చెప్పేవారు.

మనం మరి కొన్ని నిర్వచనాలను గమనిస్తే అప్పటి నాయకుల్లో చిత్తశుద్ధి తేటతెల్లం ఔతుంది.

*తరగతి గది గోడల నుండి చదువును కాపాడాలి. విషయ పరిజ్ఞానం కాదు, అభ్యాసంతో కూడిన పూర్తి అవగాహన రావాలి.* **– కాకాసాహెబ్ పాలేకర్**

*"విద్య అంటే పిల్లలు, పెద్దలు అందరి శరీరం, మెదడు, ఆత్మ, ఈ మూడింటి నుండి అత్యుత్తమ శక్తిని వెలికి తీయడమే."*

*"చదవడం, రాయడం వస్తే అది చదువు కాదు. అక్షరాస్యత ఒక పరికరం మాత్రమే. విద్యలో శాస్త్రీయత ఉండాలి. గ్రంథపఠనం సరిపోదు."*

*"శారీరకశ్రమ లేని విద్యావిధానం విద్యార్థి సర్వతోముఖాభివృద్ధికి ఉపయోగపడదు. సరికదా, శ్రమ దోపిడీకి దారితీస్తుంది."* **– గాంధీజీ**

*"పని అంటే ఒక ఉద్దేశ్యంతో చేపట్టే కృత్యం. చేతి పనిలో నైపుణ్యం, కళాత్మకత రెండూ కలిసే ఉంటాయి. పుస్తకాలు, గ్రంథాలను చదివి, క్రియాశీలత లోపిస్తే ఆ చదువు శాంతియుత జీవనశైలికి ఉపయోగపడదు."* **– జాకీర్ హుస్సేన్**

ఈ అభిప్రాయాలు ఎంత దార్శనికత గలవి!

ఇంతకూ ఈ సరికొత్త విద్యావిధానం 'నయీతాలీం' అసలు ఆచరణలోకి వచ్చిందా? ఏదో విద్యాధికుల 'స్వప్నం' గా మిగిలి పోయిందా ?

ఈ విషయం మార్జరీ సైక్స్ అనే బ్రిటిష్ విద్యావేత్త భారత దేశంలో స్థిరపడి, ఈ విధానంతో అత్యంత సన్నిహితంగా మెలిగి వ్రాసిన గ్రంథం, 'ది స్టోరీ ఆఫ్ నయీతాలీం' (1988) ను పరిశీలిస్తే మనకు సవివరంగా అర్థమౌతుంది.

1937 నుంచి 50 సంవత్సరాల పాటు వరుస క్రమంలో జరిగిన సంఘటనలను తెలుసు కోవడం వల్ల వారి కృషి, ఏళ్ళ తరబడి వారు సంఘటితంగా సమగ్ర విద్య సంపూర్ణ రూపకల్పనలో పడిన తపన, శ్రమ మనకు అవగతమౌతాయి .

1937, అక్టోబరు, హరిజన్ పత్రికలో తొలిసారిగా గాంధీజీ సమగ్ర జాతీయ విద్యావిధానపు ప్రతిపాదనలను చర్చించడం జరిగింది.

1938, హరిపురాలో సుభాష్ చంద్ర బోస్ అధ్యక్షతన జరిగిన వార్షిక భారత జాతీయ కాంగ్రెస్ సమావేశంలో 'హిందుస్థాని తాలీమ్ సంఘ్' జాతీయ విద్యా సంఘం ఏర్పాటు చేయడం జరిగింది. జూలైలో చేపట్టిన ఆత్మావలోకనంలో పాఠశాల బాగా పని చేసినట్టు, గ్రామంలో పరిసరాల పరిశుభ్రత బాగా పెరిగింది అని తేలింది.

'39 కౌంట్' నూలు వడకడం పిల్లలకు వచ్చింది. గృహనిర్మాణం, వంట చేసుకోవడం, ఆహార ఉత్పత్తి, పాత్రల తయారీ మొదలైనవన్నీ కుటీర పరిశ్రమలుగా రాణించాయి. ఆ సంవత్సరంలోనే వార్ధాలో ఆర్యనాయకం దంపతుల నేతృత్వంలో ఉపాధ్యాయ శిక్షణ పాఠశాల, గ్రామీణ పాఠశాల ప్రారంభం చేసారు. ఈ కార్యక్రమం చాల ఉత్తేజంతో కొత్త శక్తితో మొదలై, అప్పటి విద్యావంతుల దృష్టిని ఆకర్షించింది.

1939, అక్టోబర్‌లో తొలిసారిగా అఖిలభారత నయీతాలీం సమావేశం జరిగి ఈ విధానం అమలులో ఉన్న మంచి చెడ్డలు చర్చకు వచ్చాయి.

1941, వార్ధాలో రెండవ జాతీయ సమావేశం జరిగింది

1942 నాటికి, సేగావ్‌లో నయీతాలీం నూతన భవన ప్రారంభమైంది.

1945, జనవరిలో నయీతాలీం ఉపాధ్యాయుల సమావేశం జరిగింది. ఈ సందర్భంగా చదువుకున్న వారంతా గ్రామీణ జీవన సంద్రంలోకి ప్రవేశించాలని

గాంధీ పిలుపునిచ్చారు. అత్యంత ఆసక్తికరమైన విషయం ఏంటంటే ఈ సమావేశంలోనే మధ్యాహ్న భోజనం, వయోజన విద్య కూడా నయీతాలీంలో జతపరచడం జరిగింది. ఇలా ఎంత పరిపూర్ణంగా నయీతాలీం విధానం అంచెలంచెలుగా ఎదిగిందో మనం గమనించవచ్చు.

మరొక పరిణామం ఏమంటే, గ్రామీణ కార్యనిర్వాహక బృందం ఏర్పాటు చేయబడి, దాని ద్వారా అమ్మకాలు, కొనుగోళ్లు జరిపి, కుటీర పరిశ్రమలన్నీ లాభాల బాట పట్టాయని తేలింది. 1946 వ సంవత్సరం నాటికి అక్షరాలా 27 మౌలిక పాఠశాలల్లో 8 సంవత్సరాల చదువు పూర్తిచేసుకున్న విద్యార్థులు తయారయ్యారు.

1949 లో స్వాతంత్ర్యం వచ్చిన సందర్భంలో చారిత్రాత్మక ఘటనగా చెప్పుకోదగ్గ దేశ విభజన వలన భారత దేశంలోకి వచ్చిన శరణార్థులకు కూడా, నయీతాలీం ఆధ్వర్యంలో పాఠశాలలు తెరిచారు.

1950, ఫిబ్రవరి, మార్చి సమయంలో నయీతాలీం విద్యార్థులకు పరీక్షలు జరిపారు. ఇవి సాధారణ పరీక్షల మూల్యాంకనకు పూర్తి విరుద్ధంగా జరిగాయి. ఎంత విప్లవాత్మకమైనవంటే, ఆ వినూత్నమైన పద్ధతి మునుపు ఎన్నడూ జరిగినది కాదు.

వారం రోజులపాటు పిల్లలంతా కలిసి ఉన్నారు. ఉపాధ్యాయులు పర్యవేక్షణ చేసారు. ఆ వారం పాటు విద్యార్థుల ప్రవర్తన, పని, సాంస్కృతిక అంశాలలో వారు పాల్గొనే తీరునుబట్టి పరీక్షలలో ఉత్తీర్ణతను నిర్ణయించడం జరిగింది. అందరూ అన్ని కార్యక్రమాలలో ఉత్సాహంగా పాల్గొన్నారు.

1953 వ సంవత్సరంలో మానవ మలంతో ఎరువును తయారు చేసే మరుగుదొడ్లను నిర్మించారు.ఆ ఎరువుతో పంటలను బాగా పెంచగలిగారు. అదొక గొప్ప ప్రయోగం. ఏ మాత్రం దుర్వాసన లేకుండా దిగుబడి పెరిగినట్లు మార్జరీ సైక్స్ తన పుస్తకంలో పేర్కొన్నారు. ఇన్నాళ్ళు నిరాటంకంగా సాగిన నయీతాలీం ఆ తరువాత బలహీనపడింది.

1959 నుంచి 1961 వరకూ, చాలా మంది కార్యకర్తలు వేర్వేరు ప్రాంతాలకు వెళ్ళి విడిపోయారు. పారిశ్రామికీకరణ, జాతీయ స్థాయిలో అనేక విశ్వవిద్యాలయాలు స్థాపించడం ఇలా అనేక కారణాలు చుట్టుముట్టాయి.

1974 నయితాలీం వెనుకబడింది. ప్రభుత్వం రాజ్యాంగ పరంగా విద్యా విధానాలను కొనసాగించడం,1987 లో పేరుకు రజతోత్సవాలు జరుపుకున్నా, నయితాలీం దాదాపు అదృశ్యమైపోయింది.

ఎంతో ఉత్సాహంగా 50 సంవత్సరాలు నడిపినప్పటికీ అనేక అపజయాలను చూడవలసి వచ్చింది. కులం, మతంలేని ఈ విధానం అప్పటి సమాజంలోనే ఎన్నో విమర్శలు ఎదుర్కొనడం దురదృష్టకరం. ఉపాధ్యాయులు, పిల్లల నడుమ సమన్వయం బలహీనపడింది. ఒకే ప్రామాణికత గల బోధన, మూల్యాంకనం కొరవడ్డాయి.

అప్పటికీ ఇప్పటికీ విద్యావిధానంలో పెనుమార్పులు వచ్చాయి. శాస్త్రీయ అధ్యయనం, ఉద్యోగ సాధనకు కావలసిన ప్రత్యేక శిక్షణ, పరిశోధనలు, విస్తృత సమాచార విప్లవం, పోటీ పరీక్షలు, విద్యలో ప్రైవేటీకరణ, డీమ్డ్ విశ్వవిద్యాలయాలు, వృత్తి విద్యాభ్యాసంలో సైతం ప్రభుత్వేతర సంస్థల యొక్క ప్రవేశం ఇలాంటివి ఎన్నో జరిగాయి.

గత మూడు దశాబ్దాలుగా విద్యార్థులలో అవగాహనా లేమి, సంయమన లేమి, పరీక్షల సమయంలో తీవ్రమైన ఒత్తిడి, క్షీణించిన నైతిక విలువలు, విద్యార్థుల ఆత్మహత్యలు, ర్యాగింగ్, మాదకద్రవ్యాల వినియోగం, వస్తువినిమయ వ్యాపార సంస్కృతి, అరకొర వనరులతో విద్యా సంస్థల ఏర్పాటు, పోటీ పరీక్షల విధానం వంటి వాటిని చీకటి అంశాలుగా పేర్కొనవచ్చును.

ఇదిలా ఉండగా, గణనీయంగా పెరిగిన విద్యార్థుల సంఖ్య, విశ్వవిద్యాలయాలలో పరిశోధన, అత్యాధునిక అంశాలలో ప్రపంచ దేశాలతో పోటీ పడే విద్య, కంప్యూటర్ విద్య, రోబోటిక్స్ , ఏరో స్పేస్ టెక్నాలజీ, అణు శక్తి తయారీ, పరిశ్రమలు–విద్యాసంస్థల మధ్య అనుసంధానం చూస్తున్నాం.

నయితాలీం గురించి తెలుసుకోవడం చాలా గొప్ప అనుభూతి. మన భారతదేశం తన సంఘాన్ని పునర్ నిర్మించుకోవడంలో ప్రాథమికంగా ఎదుర్కొన్న సమస్యలు, వాటి పరిష్కారాల గురించి వివరంగా తెలుసుకోవాలంటే ఈ విధానం గురించి అర్థం చేసుకోవాలి.

ఈనాటి విద్యావిధానంలో గల లోపాలను సవరించుకొని మరింత విశ్లేషణతో వివేకంతో ముందుకు సాగడానికి ఇది ఎంతో ఉపయోగపడుతుంది.



# సమయపాలనే జీవన శైలి

1922 మార్చి 21, పూనా స్టేషనుకు రైలు వచ్చి ఆగింది. 50 సంవత్సరాలు దాటిన వ్యక్తి పోలీసు బందోబస్తు మధ్య దిగారు. ఒక వేన్‌లో అక్కడికి దగ్గరలోని జైలు ప్రాంగణంలోకి అడుగు పెట్టేరు. ఆ పాటికి సాయంత్రమైంది. అతని వివరాలు రిజిస్టరులో వ్రాసేరు :

| | |
|---|---|
| ఆకారం | : సాధారణం |
| నేరం | : సెక్షన్ 124 (ఆ ) ఐపీసీ ప్రకారం 'రాజద్రోహం' |
| ముందుచేసిన నేరాలు | : ఏమి లేవు. |
| ఖైదీ నెంబరు | : 827 |

వారికి తెలియనిదేమంటే ఆ వ్యక్తికి మునుపటి అనుభవం ఉంది! దక్షిణాఫ్రికాలో 3 వారాల నుంచి 3 నెలల వరకు నాలుగు సార్లు జైలుకెళ్లి ఒంటరిగా ఎలా బ్రతకాలో తెలుసుకున్న అనుభవమది. గుర్తుపట్టారా? ఔను ఆ ఖైదీ పేరు : మోహన్ దాస్ కరంచంద్ గాంధీ. చెరగని చిరునవ్వుతో పోలీసులను, గార్డులను పలుకరిస్తూ చలాకీగా తన గదిలోకి వెళ్ళారాయన.

2 దుప్పట్లున్నాయి, తలగడ లేదు. చెరసాలలోకి గాలి వెలుతురు రావు. ఒక ఎత్తైన వెంటిలేటరు తప్ప మరేం లేవు. విద్యుద్దీపానికి అనుమతి లేదు. మలమూత్ర విసర్జనకు ఒక కుండ.( చాలా నెలల తరువాత ఒక కమ్మోడు పెట్టారు.) ఆయనతో 7 పుస్తకాలు, ఒక కలం ఉన్నాయి. కాగితాలు అడిగారు, అవి ఇచ్చారు. వార్తాపత్రిక తమకు అంగీకారమైన 'బాంబే క్రానికల్' నే ఇస్తామన్నారు.

మరుసటిరోజు నుంచి గాంధీజీ, తన దినచర్య ప్రారంభించారు. సూర్యోదయానికి ముందే లేచి వ్యాయామం, ప్రార్ధన అయ్యాక 'చదువుకోవడం' ప్రారంభం. ఈ జైలు శిక్ష సమయంలో గాంధీ ఆశయం ఉర్దూ భాషను నేర్చుకోవడం. త్వరలోనే వ్యాకరణ సూత్రాలతో సహా నేర్చుకుని, మహమ్మదు ప్రవక్త జీవిత చరిత్రను చదివారాయన.

**అపుడాయనకు బోధపడిన విషయాలివి**

1. మహమ్మదు ప్రవక్త అత్యంత నిరాడంబరంగా, దేవునిపై విశ్వాసంతో, కత్తికి తావులేని సహనం, నిర్భీతి, నిస్వార్ధంతో జీవించాడు.

2. అసలు సిసలు ఉర్దూ భాషను భారతదేశంలో సంస్కృత పదాలతో కలిపే పద్ధతి అప్పట్లో ఉండేది. అలాకాక హిందీ పదాలతో కలిపినచో, ముస్లిం సోదరుల హృదయం తెలుసుకునేలా ఉంటుంది.

పై రెండు మనకు చెప్పేదేమంటే గాంధీ దేనినైనా చదివితే అందులో సాంఘిక, సాంస్కృతిక ముద్రను గమనించి పూర్వ, ప్రస్తుత, భవిష్యత్ విధానాలను, మార్పులను అంచనా వేయగలిగే దార్శనికత కలిగి ఉండేవారని.

ఇక 1922 లో ఆయన చదివిన పుస్తకాలు: రోమ్ చరిత్ర, టాంబ్రౌను స్కూలు రోజులు, వాల్మీకి రామాయణం గుజరాతీ అనువాదం, డా. జేకీల్ ఎండ్ మిస్టర్ హైడ్, 'ఈక్వాలిటీ' నవల, ద జంగల్ బుక్, గోథె వ్రాసిన 'ఫాస్ట్' అనువాదం, 'సరస్వతిచంద్ర' అనే గుజరాతి నవల సంపుటాలు, గిబ్బన్ విరచిత డిక్లయిన్ ఎండ్ ఫాల్, తిలక్ విరచిత 'గీతారహస్య' ఇతర గ్రంథాలు.

రెండో ఏడు (1923లో) మాక్స్ ముల్లర్ ఉపనిషత్తుల ఆంగ్ల అనువాదం, సిక్కుల చరిత్ర, ద ఇవొల్యూషన్ ఆఫ్ సిటీస్, రామానుజాచార్యుల జీవితచరిత్ర, బెర్నార్డ్ షా 'మాన్ ఎండ్ సూపర్ మాన్', విలియం జేమ్స్ విరచిత 'ద వెరైటీస్ ఆఫ్ రిలీజియస్ ఎక్స్‌పీరియన్సెస్' అనేవి. ఇదంతా ఆయన డైరీ లో వ్రాసిపెట్టారు.

నవంబరు 1922 లోనే ఆయన 'దక్షిణాఫ్రికాలో సత్యాగ్రహ' అనే పుస్తకం వ్రాయడం మొదలు పెట్టారు. మూడు నెలలకొకసారి కాంగ్రెసు ప్రముఖులు వచ్చి కాసేపు మాట్లాడి వెళ్లేవారు. వరండాలో పచార్లు చేయడం, ఇతర ఖైదీలతో పలకరింపులు, చరఖా పై ఖాదీ వడకటం ఆయన పనులు. ఇది గాంధీ యరవాడ జైలు శిక్ష గడిపిన సమయపు వివరాలు.

ఒక వ్యక్తి నుండి ప్రపంచ స్థాయి నాయకునిగా గుజరాత్ లో జన్మించిన మోహన్ దాస్ కరంచంద్ గాంధీ ఎలా ఎదిగారో అని పరిశీలిస్తే, ఒక జీవితకాలపు అద్భుతం అని చెప్పవచ్చు. గాంధీజీ తన సమయాన్ని ఎలా నియంత్రించుకున్నారో చూస్తే ఆశ్చర్యం వేస్తుంది. గాంధీజీ ప్రతిరోజూ ప్రణాళికా బద్ధంగా గడిపారు.

ఆయన లండన్లో బారిష్టరు పరీక్ష వ్రాయడానికి వెళ్ళినపుడు కొన్న గడియారం ఎల్లప్పుడూ ఆయన నడుముకు వ్రేలాడుతూ ఉండేది . “ఈ గడియారం నా జీవితాన్ని నడిపే మీటర్”, అనేవారాయన. ఒక్క నిముషం తన సమయం వృధా చేయకుండా, అలానే ఇతరుల సమయాన్ని నష్టపరచకుండా ఆయన మసలుకునేవారు.

దక్షిణాఫ్రికాలో ఉదయం, పళ్ళు తోముకునే చోట భగవద్గీతా శ్లోకాలను వ్రాసిన కాగితాలు గోడకు అంటించుకుని ఆ సమయంలో వాటిని పఠించి కంఠస్తం చేసేవారట.

1921 ఏప్రిల్ నెలలో గుజరాతీ విద్యాపీఠంలో ఒక సాయంత్రం ప్రసంగించవలసి ఉండగా ఎంతకూ నిర్వాహకుల నుంచి మోటారు బండి రాక ఇక ఐదు కావస్తుంటే దగ్గరలోని సైకిల్ ఎక్కి ఆ సభాస్థలికి గాంధీజీ వెళ్లారట. ఇది చాలు, ఇతరుల సమయంపై ఆయనకున్న శ్రద్ధను తెలిపేందుకు .

దేశ, విదేశ విలేఖరులు, నాయకులు, సందర్శకులు వచ్చినపుడు తన దైనందిన కార్యకలాపాలకు అంతరాయంలేకుండా అందరితో సంభాషించేవారు. ఒకోసారి సమయాభావం ఐతే వారిని “నడుస్తూ మాట్లాడుకుందా” మంటూ లేక ఆశ్రమంలో తోటపని, పరిసరాల శుభ్రత, పెంపుడు జంతువుల పోషణ చేస్తూనే వారితో మాట్లాడేవారు. వ్యాధిగ్రస్తులకు పరిచర్యలు చేసేందుకు వేచి ఉన్న సమయంలో సహితం గాంధీజీ తన ఉత్తరప్రత్యుత్తరాలు నడిపేవారు.

ఇక రైలు ప్రయాణం ఆ రోజుల్లో ఎంతో ప్రయాసగా ఉన్నప్పటికీ, ప్రయాణ సమయంలో గాంధీజీ పత్రికలకు వ్యాసాలను వ్రాస్తూ ఉండేవారు. కుడిచేయి నొప్పి పుడితే ఎడమచేతితో వ్రాసేవారటగొప్ప విషయమేమిటంటే ఆయన ఎడమచేతి దస్తూరి కూడా చక్కగా ఉండేదట. ఇది ఆయన పరిశ్రమను తెలుపుతుంది. ప్రతి సోమవారం మౌనవ్రతం పాటిస్తూ ఆత్మపరిశీలన సాధన చేసేందుకు ఉపయోగించుకునేవారు.

టాల్‌స్టాయ్, వార్ధా ఆశ్రమాల్లో నివాసితులు అందరకు ఒకే కార్యాచరణ నిర్దేశింపబడేది. ఉదయం వ్యాయామం, వంట, ఆశ్రమ పరిశుభ్రత, తోటపని, చరఖా పై నూలు వడకుట, సామూహిక ప్రార్థన, భజనలు అన్నీ అందరికీ శిరోధార్యం. వంటశాలలో కూరగాయలు తరగటం వంటి పనులకు తన వంతు పని గాంధీ అందించేవారు.

ఆయన ఏనాడూ "సమయం సరిపోదు" అన్నమాట అననేలేదు. ప్రతిపనీ ఒకదాని తర్వాత ఒకటి చేయడమే. కళాకారులను గాయకులు, రచయితలు, చేతిపనిలో నిపుణులు అందరినీ ఆదరించి, వారితో ముచ్చటిస్తూ కొత్త విషయాలు తెలుసుకునేవారు.

ఆయన మాటల్లో ఒకింత హాస్యం ఎప్పుడూ ఉండేది. ఐతే అది ఎవ్వరినీ నొప్పించేది కాదు." మీరెప్పుడూ రైలులో మూడవ తరగతిలో ప్రయాణం చేస్తారెందుకు?" అని ఒకరు ప్రశ్నిస్తే, గాంధీజీ, "అదా! మరి నాల్గవ తరగతి లేదుగా?" అన్నారట.

లండన్ పర్యటనలో, "వైస్రాయ్ మీ డ్రెస్ కోడ్ గురించి ఏమన్నారు?" అని విలేకరులు ప్రశ్నించగా, "మా ఇద్దరికీ సరిపడా ఆయన దుస్తులు ధరించారు." అన్నారట.

నవ్వుతూ ఉండటం వల్ల జటిలమైన పరిస్థితుల్లో కూడా సమర్ధవంతంగా పనిచేయగలమని గాంధీజీ అభిప్రాయం.

చివరకు 1948 జనవరి30, ప్రార్ధనా స్థలానికి వెళ్తూ, 5 గంటల 55 నిముషాలు అయిందని ఆఖరుగా చూసి, ఆలస్యమైనందుకు, చర్చలు తేలనందుకు చింతిస్తూ, సభాస్థలికి వెళ్ళే తొందరలో, గడియారం మరిచిపోయారు. అదే ఆయనకు సమయానికి నడుమ నిలిచిన అగాధం. అపుడే ఆయన తుదిశ్వాస విడచిన విషాదం.

నేల ఒలికిన పాలలా, గడిచిపోయిన కాలం మళ్ళీ దొరకదు. అందుకే అప్రమత్తంగా ఉంటేనే సార్ధకత చేకూరుతుంది. మనిషిని అస్థిరత్వం లోకి నెట్టివేసే ప్రతికూల పరిస్థితులను సైతం సృజనాత్మకంగా మలచుకోవడం వివేకవంతమైన పని. దానికి సమయపాలన ఆవశ్యకత ఎంతైనా ఉంది.



# చెడు వినవద్దు, కనవద్దు, అనవద్దు.

మహాత్మా గాంధీకి తనవి అంటూ ఉన్న వస్తువులు చాలా తక్కువ :

అవి, కళ్ళజోడు, ఒక చెప్పుల జత, జేబు గడియారం, చిన్న పాత్ర, పళ్లెం. ఇవి కాక మూడు కోతుల బొమ్మ. దీనిని చైనా దేశం నుంచి గాంధీజీని కలుసుకోవడానికి వచ్చిన సందర్శకులలో ఒకరు తెచ్చి, అర్థం చెప్పి ఇచ్చారట. కన్ఫ్యూషియస్, టావోయిజం, జపాన్ షింటోఇజం ఈ మూడింటి ప్రాచీన గ్రంథాలలో మూడు కోతుల గురించిన ప్రస్తావన ఉందట.

జపాన్ షింటోయిజం ప్రకారం మిజారు, కికజారు, ఇవజారు అంటే ఏదైనా ఒక పనిని సులువుగా, సహజంగా, ప్రామాణికంగా చేయడానికి మన మనసును సమాయత్త పరిచేవి అని చెప్తారు.

మిజారు అంటే చెడు చూడవద్దు. కికజారు అంటే చెడు వినవద్దు. ఇవజారు అంటే చెడు మాట్లాడవద్దు- ఇది మనందరకు తెలిసిన విషయమే. అయితే దీనిని గాంధీ ఎలా అపురూపంగా దాచుకున్నారు? ఎందుకు ఆ ప్రస్తావన పెద్ద ఎత్తున చేయలేదు? కాస్త పరిశీలిద్దాం.

మనం చేసే పని ఏదైనప్పటికీ చూసి, విని, మాట్లాడి- కదా చేస్తాం? కానీ అలా ఒక పని చేసేముందు మనం మన మనసులో ఏదో భావిస్తాం. ఎంతో ఆలోచిస్తాం. బహుశా ఈ మూడు ప్రక్రియలు ఎంత స్వచ్ఛంగా, నిబద్ధతతో ఉండాలో మనకు తెలిపేదే ఈ మూడు కోతుల బొమ్మ.

మానసిక శాస్త్ర ప్రకారం, మనిషి తన జీవితంలో ఏదైనా కోరుకున్నది దొరకగానే సంతోషాన్ని, దొరకని క్షణంలో బాధను పొందుతూనే ఉంటాడు. ఈ బాధ భౌతికమైన నొప్పి దగ్గరనుంచి వ్యక్తిగతమైన శూన్యంగా, సామూహికమైన అశాంతిగా మనల్ని ఆవరించి ఉంటుంది. చెప్పాలంటే అనుక్షణం మన చుట్టూ ఉన్న వాటి నుంచి చూసి, విని, వాటి ప్రభావానికి గురైన పిదప మనం కొన్ని

భావనలకు లోనవుతాం. వాటిని 'ఉద్వేగాలు' అంటారు. ఆ తరువాత ఈ ఉద్వేగాలు మన ఆలోచనలను ప్రభావితం చేయడం మొదలు పెడతాయి.

ప్రపంచమంతా అరచేతిలోకి వచ్చిన ఈనాటి చరవాణి సాక్షిగా దేశవిదేశాలలో జరుగుతున్న సంఘటనలు, వారి అలవాట్లు, శాస్త్రీయ ఆలోచనావిధానాలు, వైజ్ఞానిక పరమైన ఆవిష్కరణలు, ఇవన్నీ కుండపోత వర్షంలా, వెంటనే వార్తగానో, ప్రకటన రూపంలోనో మనవద్దకు చేరుతోంది. ఇది ప్రపంచీకరణ ప్రభావం.

అయితే ఇలా వచ్చి పడిపోతున్న అనేకమైన వార్తలు, కొత్త విషయాలు ఒక సగటు మానవుని చిన్నిగుండె, చిన్నారి మనసు మెదడు తట్టుకోలేకపోతున్నాయా? అన్నదే ఒక సందేహం. రమారమి రోజుకు 50 నుండి 70 వేల ఆలోచనలు మనిషి మెదడులో వస్తాయని శాస్త్రజ్ఞులు చెబుతున్నారు.

గాంధీ కాలానికి, రవి అస్తమించని విస్తృత బ్రిటిష్ సామ్రాజ్యపు అధినేతలు తాము చేజిక్కించుకున్న దేశాలలోని సహజ వనరులను, ఆ దేశ పౌరుల శ్రమను చేసిన దోపిడీ అతి పెద్ద సవాల్. పైగా, ఒక చిన్న దేశం నుంచి చాల తక్కువ సంఖ్యలో వచ్చి, తాము ఆక్రమించుకున్న దేశాలలోని పెద్ద సమూహాలను నియంత్రించడం మామూలు విషయం కాదు. వారిదెంత దుష్టనీతి అంటే, ఒక సమాజంలోని వ్యక్తుల చేత తమ తోటి మనుషుల పైనే అధికారం చెలాయించేలా, శారీరకంగా హింసించేలా, మానసికంగా బానిసత్వానికి లోను చేసి, విదేశీయులతో చేయి కలిపి పీడించేలా ఎలా ప్రేరేపించ గలిగారు? ఇదిఎంత దారుణమైన దోపిడీయో ఊహకు అందడం కష్టం.

ఇంతటి రాజకీయ సంక్షోభ సమయంలో "రైలులో ప్రథమశ్రేణిలో కూర్చోవడానికి నువ్వు తగవ"ని గాంధీని కిందకు దింపినప్పుడు అతడు పొందిన ఆత్మన్యూనతాభావం, ఆ అవమానం గాంధీలో ఎలా తిరుగుబాటుభావాన్ని రగిలించినదో, ఆపైన అదెలా ఉద్యమ రూపం దాల్చిందో ఆలోచిస్తే ఆశ్చర్యకరమైన మానసిక సంఘర్షణ మనకు గోచరిస్తుంది.

ఒక వ్యక్తిగా తనకు కలిగిన అవమానం లోంచి, ఒక వర్గం మరొక సమాజాన్ని తక్కువగా చూసి, ఎలా వివక్షను చూపుతోందో దాన్ని గాంధీజీ గుర్తించగలిగాడు. ఎలా ఒక దేశ ప్రజలు ఇతర దేశాల పౌరులను ప్రాథమిక మానవ హక్కులను

కాలరాసి, కనీస గౌరవం ఇవ్వకుండా అణగద్రొక్కారో అనే నిజం వైపు దృష్టి సారించడమే గాంధీ చేసిన అతి గొప్ప ప్రయత్నం.

ఈ క్షణకాలపు అవమాన భారం ఆయన జీవితకాలపు స్వతంత్రపోరాటంగా మారింది. స్వాతంత్ర్యం అంటే తమను తాము పరిపాలించు కోవడం. స్వేచ్ఛ అంటే మరొకరి నియంత్రణలో ఉండక తమ జీవితం గురించి తామే నిర్ణయాలను తీసుకోగల స్వయంప్రతిపత్తి కలిగిఉండడం. ఈ రెండింటినీ గాంధీ సమన్వయం చేసారు.

పోలీసు లేదా మిలటరీ వ్యవస్థతో బ్రిటిష్ రాజ్ తమకున్న తుపాకులు, మందుగుండు సామానుతో అతి తక్కువ సమయంలో అతి ఎక్కువ మందిని భయంతో అణగదొక్కాలని చూసింది. చెరసాల గోడల సాక్షిగా తమను ఎదిరించి నిలుచున్న ప్రతి వ్యక్తిని నేరస్తుడిగా ప్రకటించి శిక్షార్హులుగా మార్చింది. ఆ అకృత్యాలను ఎదిరించి నిలిచిన వాడే సత్యాగ్రహి.

సత్యాగ్రహి సత్యం కోసం ఆగ్రహం చెందుతున్నాడు. ఆ సత్యమే స్వేచ్ఛ. అతడి ఆగ్రహాన్ని సైతం అహింసాయుత విధానంలోనే వెల్లడి చేస్తాడు. ఎవరినీ నిందించడు. ఎవరి పట్ల అసత్యప్రచారం చేయడు. ఎవరి పట్ల ద్వేషం పెంచుకోడు, వారితో యుద్ధానికి దిగడు. ప్రత్యర్థి తాను అవలంబించిన విధానం మరొక మనిషిని, సమూహాన్ని ఎలా బాధిస్తోందో తెలియచేసి వారి లోలోపలి 'సెన్సిబిలిటీ'ని మేల్కొలపడమే సత్యాగ్రహం.

గాంధీజీ దక్షిణాఫ్రికాలో మొదటిసారిగా చెరసాల పాలైనప్పుడు తాను ఒక హంతకుని పక్కన ఒక గోడ మాత్రమే అడ్డుగా రెండు నెలలపాటు చెరసాలలో ఉన్నాను అని చెప్తూ "మూడడుగుల ఆ గది, రెండు నెలల భయంకరమైన మౌనం ఆ నేరస్తుడిని ఏం మార్చిందో నాకు తెలియదు గానీ నన్ను మటుకు సత్యం వైపుకు నడిచేలా చేసింది" అని చెప్పారు.

బ్రిటిషువారి వర్ణ వివక్షపై నిరసనను తెలిపి, ఆ తరువాత దాన్ని మత, వర్గ, లింగ వివక్షలపై "నిరంతర పోరాటం"గా గాంధీజీ విస్తృత పరిచారు. ఆయన మళ్లీ, మళ్లీ తన ఆలోచనలను పరిశీలించుకుంటూ, ప్రతిసారి సత్యం వైపే చూస్తూ, మొదటి రోజు తాను ఏ ప్రతికూలతను, అణచివేతను అనుభవించాడో అటువంటి బాధను మరెవ్వరూ పొందకూడదని తన ఉద్యమాన్ని కొనసాగించాడు .

మూడు కోతుల బొమ్మ సాక్షిగా గాంధీజీ తన మనసును, మాటను, చెవులను అసత్యం నుంచి, అబద్ధాల నుంచి, బలహీనతల నుంచి వడపోసుకుని అహింసాయుత పోరాటం చేయడానికి ముందుకు సాగినట్లుగా మనకు తెలుస్తోంది. అందుకే ఆయన వేలకొలది శిష్యులను పొందగలిగాడు. వందలకొలది మేధావులను ఆకర్షించగలిగాడు. లక్షల కొలది సాధారణ పౌరులను తన అనుయాయులుగా చేసుకోగలిగాడు. సమాజంలో ఉన్న ప్రతివారి సమస్యను తన సమస్యగా గుర్తించగలిగాడు. కూడు, గూడు, గుడ్డ అనే మూడు ప్రాథమిక అవసరాలకోసం ఏ దేశంలోనూ పరాయిపాలనలో న్యాయం జరగదని, దానికి రాజకీయ స్వాతంత్ర్యం చాలా ముఖ్యమని ఆయన ఉద్ఘాటించారు.

ఇందుకు నిరంతరం సమాజక్షేమం కోరి ఎటువంటి ప్రతికూల విషయాలను వినక, చూడక, మాట్లాడక ఉండడానికి ఈ మూడు కోతుల బొమ్మను తన ఆదర్శంగా, భావితరాలకు తన సందేశంగా ఆయన వదిలి వెళ్ళారని అనుకోవచ్చు.



# స్వాతంత్ర్యోద్యమంలో మహిళల భాగస్వామ్యం

1910 ప్రాంతంలో భారత స్త్రీ సగటు ఆయుఃప్రమాణం 27 సంవత్సరాలు. నమ్మగలమా? ఔను నిజం. ఆనాటికి ప్రసవ సమయ మరణం సర్వసాధారణం. ఉత్తర భారతంలో 'పరదా' పద్ధతి ఎంత ప్రబలంగా ఉండేదో ఊహించలేం. మగవారు తోడు లేకుండా ఆడవారు బయటకి నడవడం అన్నది తెలియనే తెలియదు. బాల్యవివాహాలు, మహిళల నిరక్షరాస్యత, భారత సంఘాన్ని చెదలు పట్టిన పాత చెక్కలా తయారు చేశాయి. మరిప్పుడు? విద్యావంతులైన మహిళలు : 56.8%. ఉద్యోగులు: 23.6% కానీ, మానభంగానికి గురౌతున్న మహిళలు 2012లో 24,923 కాగా ఈ సంవత్సరం ఇది  33 వేల పై చిలుకు.

'నిర్భయ' 'దిశ' సంఘటనల నేపథ్యంలో, "ఈ దేశంలో అర్ధరాత్రి వేళ మహిళ ఒంటరిగా సురక్షితంగా నడవగలిగిన నాడే మనకు స్వరాజ్యం సిద్ధించినట్టు" అని గాంధీజీ చెప్పిన మాట మళ్ళీ జ్ఞాపకం చేస్తోంది.సగటు మహిళ భయాందోళనలతో కుచించుకుపోయి, జీవించడం కోసం పోరాటం చేస్తున్న దుస్థితి. భారతీయ మహిళ ప్రయాణం ఎటు అని ఆందోళన.

ఈ నేపథ్యంలో, గాంధీజీకి మహిళల అభ్యుదయం పట్ల గల ఆలోచనలను గురించి తరచి చూస్తే, కొన్ని ముఖ్యమైన అంశాలు అవగతమౌతాయి.

1915లో మోహన్‌దాస్ కరంచంద్ గాంధీ భారతదేశ రాజకీయ రంగప్రవేశం చేసారు. అప్పటినుంచే  భారతీయ సంఘ అస్తిత్వంలోకి తన జీవితాన్ని మమేకం చేసుకున్నారు. 1913, దక్షిణ ఆఫ్రికాలో గాంధీ  నిర్వహించిన పౌరహక్కుల పోరాటంలో మహిళల పాత్ర ప్రశస్తమైనది. పురుషులు సత్యాగ్రహులుగా పోలీసుల చేతిలో  లాఠీ దెబ్బలు తింటే, వారికి సేవ చేస్తూ, పోరాటంలో అడుగు వేసినది మహిళలే. వలస కుటుంబాల మహిళలు  స్వచ్ఛందంగా ఇలా ముందుకు రావడమే కాక, తాము కూడా ఉద్యమించారు. బ్రిటిష్ ప్రభుత్వ విధానాలను, చట్టాలను ఎదిరించారు. మద్య నిషేధం,  విదేశీ వస్తువుల బహిష్కరణ అవలంబించారు.

బహిరంగ సమావేశాలను ఏర్పాటు చేశారు. "ఒక ఉద్యమంలో మహిళలు పాలు పంచుకోవడం అంటే ఎలా ఉంటుందో నాకు అప్పుడే అర్థమైంది" అన్నారాయన.

అప్పటి నుంచి, గాంధీ మహిళలను అబలలుగా ఎప్పుడూ చూడలేదు. పెళ్లి, చదువు అనే ఏవో కొన్ని విషయాలలోనే కాక, సహేతుకంగా, సమూలంగా మహిళల జీవితాలలో మార్పు రావాలని గాంధీ అభిప్రాయం. నైతిక, రాజకీయ, సామాజిక, ఆర్థిక రంగాల్లో, నిత్య జీవన విధానంలో పరిపూర్ణమైన మార్పు మాత్రమే ఆడవారికి నిజమైన స్వేచ్ఛనిస్తుందని ఆయన గుర్తించారు.

"శతాబ్దాల తరబడి మూఢ నమ్మకాలు, దురాచారాలతో నిండిపోయిన సమాజంలో స్త్రీలు స్వేచ్ఛావాయువులు పీల్చుకోవాలి" అని చెప్పేవారు. "ఈ దిశగా మగవారు వారికి సహాయం చేయగలరు కానీ, పూర్తిస్థాయి పోరాటం మహిళలు తామే చేయా" లని గాంధీ చెప్పేవారు.

గాంధీజీ, సత్యాగ్రహ ఉద్యమంలో పాలు పంచుకొనే వారితో "మీ భార్య, మీ కుటుంబంలోని మహిళలు ఏరి? వారు వంటింటికి పరిమితం కాకూడదు. వారిని కూడ ఉద్యమంలో క్రియాశీలక పాత్ర పోషించడానికి రమ్మనండి" అని ఉద్బోధించేవారు. "రాజకీయ పోరాటాలు, ఒక జాతి వికాసానికి మాత్రమే తప్ప, సమన్యాయం సాధించకపోతే, అవి నిరుపయోగం" అని హెచ్చరించేవారు.

ఆయన ఉద్బోధించిన మాటలు ఎంతగా ప్రభావితం చేసేవంటే, అప్పటి పురుషులందరూ కుల, మత, వర్గ విభేదాలు లేకుండా, తమ కుటుంబంలో మహిళలను స్వాతంత్ర్య సంగ్రామంలోకి ఆహ్వానించేలా. అలనాటి ప్రపంచ సమాజంలో సామూహిక మానసిక వికాసానికి (collective psychological evolution) ఇదొక శుభ పరిణామం.

గాంధీజీ భావాలు ఎంత విప్లవాత్మకంగా ఉండేవో మచ్చుకు చూద్దాం :

"మనిషి చేసే అత్యంత హీనమైన, క్రూరమైన ఆశ్చర్యకరమైన పని ఏదైనా ఉంటే అది మహిళలను అణచి వేయడమే."

"పురుషునితో సమంగా కార్యకలాపాల నిర్వహణ చేయగల పరమోన్నతమైన శక్తి, స్త్రీకి ఉన్నది. భారతీయ మహిళ వెనుకబడితే భారతదేశం ముందుకు పోలేదు."

"మన అశుద్ధతను శుభ్రం చేయడమే హరిజనులను అస్పృశ్యులుగా ముద్ర వేస్తే, మన తల్లియే తొలి అంటరాని వ్యక్తి. ఎందుకంటే బిడ్డను పెంచడంలో ఆ బిడ్డ

అశుద్ధంను శుభ్రం చేసింది తల్లే కనుక.”

“మహిళలు ఎప్పుడూ న్యాయాన్ని కోరాలి అంతే కానీ రాయితీలను కాదు.”

స్త్రీ స్వేచ్ఛ, మహిళా సాధికారత పట్ల ఇంతటి స్పష్టత ఆయనకుంది.

1917, చంపారన్‌లో రాజేంద్ర ప్రసాద్ భార్య బన్సీదేవి, సహోదరి భగవతీ దేవి మొట్టమొదటి మహిళా సత్యాగ్రహులని గమనించవచ్చు. భగవతీ దేవి ఛాందస మత సంప్రదాయాలకు లోబడి జీవిస్తున్న బాల వితంతువైనా, గాంధీ ప్రేరణతో, తన అన్న సహకారంతో, ‘పరదా’ పద్ధతిని వదిలిపెట్టిన తొలి మహిళ అని చెప్పుకోవాలి. సంపన్న కుటుంబ నేపథ్యం నుంచి వచ్చిన ఇలాంటి మహిళలు, ఇతరుల సాంఘిక, ఆర్థిక వెనుకబాటును గమనించి, వారి అభ్యున్నతి కోసం శ్రమించారు.

కస్తూరీబా ఆధ్వర్యంలో, గ్రామాలలో పాఠశాలలు, ఆరోగ్య కేంద్రాలు తెరవడం అప్పటి సంఘానికి ఒక కొత్త దారి తెరిచిందని చెప్పాలి.

మారుమూల గ్రామాలలో తెరచిన ఈ సంస్థలలో పని చేయడానికి కస్తూరిబా, అవంతిక బాయ్ గోఖలే, మణిబెన్ వంటి మహిళలు గాంధీ జట్టులో నిలబడ్డారు. ఇదొక విప్లవాత్మక ముందడుగు.

మహిళలకు రాజకీయ ప్రవేశం దొరికిన చారిత్రాత్మక మలుపు ఇది.

1918లో ఖేడా, గుజరాత్ లో జరిగిన బహిరంగ సభలో గాంధీజీ, మొదటిసారి ఒక ప్రత్యేక పిలుపునిచ్చారు. “మహిళలు మాతో ఉంటేనే మాకు ధైర్యం, సత్యాగ్రహ ఉద్యమంలో పాల్గొనగల మానసికమైన శక్తి వస్తాయి” అని ప్రకటించారు.

గుజరాత్‌లో ఆయన చేసిన పర్యటనలలో ఆడవారి నుంచి ధనాన్ని, నగలను ‘స్వరాజ్య నిధి’ కోసం జోలె పట్టి అభ్యర్థించారు. ఆ తరువాత దేశవ్యాప్తంగా అన్ని వర్గాల మహిళలు విరాళాలు ఇచ్చారు. శ్రీమతి అనసూయ సారాభాయ్ అహమ్మదాబాద్ బట్టల మిల్లు కార్మికుల సమ్మెలో కీలకమైన పాత్ర వహించగా, 1920 – భారత జాతీయ కాంగ్రెస్ సమావేశాల నుంచి, ప్రభుత్వానికి వ్యతిరేక పోరాటాలన్నిటిలో మహిళల పాత్ర పెరుగుతూ వచ్చింది.

మహిళా కార్యకర్తలు తమకు తామే జట్లుగా కూడి, ఒకరినొకరు ఉత్తేజపరచుకుంటూ, చరఖా వడకడం, మద్య నిషేధం, కరపత్రాల ముద్రణ వంటి ఎన్నో కార్యక్రమాలను చేపట్టారు.

'స్వదేశీ' ఎంతగా ప్రాచుర్యం పొందిందంటే ఒక సమయంలో బెంగాల్లో విదేశీ వస్తువులను అమ్మే దుకాణం వద్దకు వెళ్లి మహిళలు ధర్నా చేస్తుండగా, 'మీ చేతులకున్న గాజులు జెకస్లోవేకియా నుంచి దిగుమతి చేసుకున్నవి' అని ఎవరో చెప్పగా, అక్కడిక్కడే చేతికున్న గాజులను మహిళలు బద్దలుకొట్టిన ఉదంతం ప్రముఖవార్తగా ప్రాచుర్యం పొందింది.

బెంగాల్‌లో 'బయోసీజన్ కాలేజ్' ను వదిలేసి, విదేశీ విద్యకు నిరసన తెలిపి రేణుక రే, లలిత రే చరిత్రలోకి ఎక్కారు. విదేశీ ప్రభుత్వం పట్ల విముఖత, ఒక పెద్ద తుపానులాగా భారతదేశంలో వ్యాపించిందనడంలో సందేహం లేదు.

గాంధీ పిలుపు మేరకు స్త్రీలు పురుషులతో కలసి ఉద్యమించడం, అంకిత భావంతో పాలుపంచుకోవడం ప్రపంచ చరిత్రలోనే మొట్టమొదటి అహింసాయుత పోరాటానికి నాంది అని చెప్పాలి. కుగ్రామాలలో సైతం, విదేశీవస్త్రాలను తగలబెట్టడం జరిగేది. లోగిళ్ళలో చరఖా తిప్పి నూలు వడకడంతో, మహిళలు స్వతంత్ర పోరాటాన్ని ఇంటింటా అమలు చేసారు.

ప్రాంతీయ భాషలలో దేశభక్తి గీతాలను రచించి పాడడం, అరెస్టు కావడం, పోలీసు వారిచే లాఠీ దెబ్బలు తినడం లాంటి ఎన్నో పనులు భారతీయ మహిళలు అలవోకగా చేశారు. ఎందరో మహిళలు ఉన్నత విద్య, సాంకేతిక విద్య, అభ్యసించి పై స్థాయి ఉద్యోగులు, శాస్త్రవేత్తలుగా ఎదిగారు. మరెందరో రచయితలుగా, సాంఘిక సంస్కర్తలుగా పలు సామాజిక కార్యక్రమాలు నిర్వహించారు.

1870 నుంచి 1920 వరకు 50 సంవత్సరాల కఠినమైన పోరాటం తరువాత ఐరోపా మహిళలకు ఓటు హక్కు వస్తే, భారతీయ మహిళ, తమ దేశ స్వాతంత్రోద్యమం జరిగే సమయంలోనే పూర్తి స్థాయి విమోచన పొందిందని ప్రపంచ వార్తాపత్రికలు వ్రాసాయి. మహిళలకు ఓటు హక్కు భారత రాజ్యాంగం వెంటనే ఇవ్వటం స్వాతంత్ర్య పోరాటంలో మహిళలు పాలుపంచుకోవడం వల్లనే అనడంలో సందేహం లేదు.

1930 మార్చి 12న జరిగిన ప్రతిష్ఠాత్మక 'దండి ఉప్పు సత్యాగ్రహం'లో, ఎందరో మహిళా కార్యకర్తలు పాల్గొన్నారు. అంత దూరం నడక సాగించడం మహిళల వల్ల అవుతుందో లేదో అని గాంధీజీ అనుకుంటే దానిని తప్పని నిరూపిస్తూ సాధారణ మహిళలు సైతం ముందంజ వేశారు. ఇది గాంధీనే ఆశ్చర్యపరచిన సంఘటన.

రాజకీయ స్వాతంత్ర్యంతో పాటు, భారతదేశ సంఘ పునర్నిర్మాణం ముఖ్యమని నమ్మిన గాంధీ, 13 సూత్రాల కార్యాచరణను తయారు చేశారు.

ఇందులో బాల్య వివాహాల రద్దు, వితంతు పునర్వివాహం, స్త్రీల విద్య, ఆర్థిక స్వాతంత్ర్యం ప్రధానంగా ఉన్నాయి. దీనిని 'కన్‌స్ట్రక్టివ్ ప్రోగ్రామ్ ఇట్స్ మీనింగ్ అండ్ ప్లేస్' (నిర్మాణాత్మక కార్యాచరణ, అర్థమూ, పాత్ర) పేరిట 39 పేజీల పుస్తకం 1941, డిసెంబర్ 13 న వెలువరించారు.

మాతృభాషలో విద్యాబోధన, మహిళలకు ఆర్థిక స్వాతంత్ర్యం, ఉద్యోగ అవకాశాల కల్పన, వారి ఆత్మ గౌరవాన్ని కాపాడవలసిన ఆవశ్యకత గురించి ఆయన ప్రస్తావించారు. సహాయనిరాకరణకు ఈ కార్యాచరణ ప్రణాళిక ఆశావహ పార్శ్వం.

1930, సత్యాగ్రహ ఉద్యమంలో 30 వేల మంది చెరసాల పాలైతే, అందులో 17 వేల మంది ఆడవాళ్లు. అప్పటి స్వాతంత్ర్య పోరాటం శాంతియుత సహాయ నిరాకరణ ఉద్యమంగా ఎదిగి, స్త్రీ, పురుష వివక్ష లేని ఏకీకృత పోరాటంగా మారింది. అందుకే భారతీయ స్వాతంత్ర్య పోరాటాన్ని 'ఆధునిక భారత మహిళా విమోచన' పోరాటంగా అభివర్ణించవచ్చు

"సంప్రదాయాలను పాటించడం ఒక దేశ సంస్కృతికి ప్రతీక కావచ్చు, కానీ వాటితో ఆగిపోవడం ఆత్మహత్యా సదృశ్యం" అన్నారు గాంధీజీ. భారతదేశంలో పాతుకు పోయిన కొన్ని అర్థరహితమైన కట్టుబాట్లు గాంధీని అతలాకుతలం చేశాయి. ఉద్యమం కన్న భారతదేశపు సమాజ పునర్నిర్మాణమే ఆయనకు ముఖ్యం అనిపిస్తుంది.

బాల్య వివాహాలు శారీరకంగా, మానసికంగా ఆడవాళ్లను కాలరాచే అత్యంత హేయమైన, క్రూరమైన, వికృతమైన ఆచారంగా గాంధీ వర్ణించారు.'పరదా' ధారణను అనాగరికమైన ఆచారంగా ఆయన అభివర్ణించారు. "నాకు ఎప్పటికీ అర్థం కాని ప్రశ్న ఒక్కటే– ఎందుకు మహిళ ఒక్కతే నైతికంగా స్వచ్ఛంగా ఉండాలి? పురుషులు ఎందుకు విలువలను పాటించకూడదు? మగవారి శీలం గురించి ఎందుకు చర్చ జరగదు? వీళ్ళు ఎప్పుడూ మహిళల శీలం పరిరక్షించాలని ప్రయత్నం చేస్తున్నారెందుకు ? పురుషుడు కూడా తన వ్యక్తిత్వాన్ని ఏ దోషం లేకుండా ఉండేలా చూసుకోవాలి" అని ఆయన చెప్పారు.

స్త్రీ తనను తాను కామానికి ఉపయోగపడే విలాస వస్తువుగా చిత్రించుకోవడమే అతిపెద్ద పొరపాటు. పురుషునితో సమానంగా కుటుంబ, సమాజ నిర్మాణంలో

పాలు పంచుకుంటూ తద్వారా దేశసేవ చేయవలసి ఉంటుందని గాంధీజీ ఉద్ఘాటించారు.

"మానభంగానికి గురైనపుడు, మహిళలు ఆ మగవానిని ఎదుర్కొని, తమ పళ్ళు, గోళ్ళు ఉపయోగించి గాయపరచాలి. నేను హింసను అంగీకరించేది ఈ ఒక్క పరిస్థితి లోనే. తన ఇష్టానికి వ్యతిరేకంగా దాడిచేసిన పురుషునిపై స్త్రీ ఎలా ఎదురు తిరిగినా అందులో తప్పులేదు" అని గాంధీజీ అన్నారు. "మానభంగం జరిగితే శీలం కోల్పోయానని ఏ మహిళా భావించకూడదు. ఆ సంఘటనను వదిలిపెట్టి, ఆ మహిళను సమాజం సంపూర్ణంగా అంగీకరించాలి" అని చెప్పారు.

గాంధీజీ ఏ విషయంపైనైనా నిస్సంకోచంగా, పూర్తి స్పష్టతతో తన అభిప్రాయం చెప్పడం ఇప్పటికీ ఆ స్థాయి నాయకుల్లో మనం చూడలేం.

"మహిళను వితంతువుగా జీవితాంతం ఉండమనడం వాళ్ల హక్కులను కాలరాయడం అవుతుంది. ఒక మహిళ తనకుతాను తన భర్త జ్ఞాపకాలలో జీవించదలుచుకుంటే ఆ స్వేచ్ఛ ఆమెకు ఇవ్వాలి. కాని పక్షంలో, భార్య చనిపోయిన తరువాత పెళ్లి చేసుకునే పురుషుని లాగే, స్త్రీ కూడా వివాహం చేసుకోవడానికి సమాజం అంగీకరించాలి." ఇవి మహిళలు– వారి హక్కులపట్ల గాంధీజీకి గల సమున్నత భావాలు.

మత కలహాలను ఎదుర్కొనడంలో స్త్రీ మరింత ప్రముఖపాత్రను పోషించాలని గాంధీ ఆశించేవారు. మతకల్లోలాలలో పాలుపంచుకుని ఇంటికి వచ్చిన మగవారికి, మహిళలు వంట చేయకుండా తమ అసమ్మతి తెలియచేయాలని ఆయన చెప్పేవారు.

వరకట్నంతో జరిగే పెళ్లిని మగవారు 'తమను తాము అమ్ముకునే పద్ధతి'గా గాంధీ చెప్పేవారు. పరస్పర ప్రేమ, గౌరవంలేని పెళ్ళి అనవసరం అని చెప్పేవారు. స్త్రీ పురుషుడు ఇద్దరికీ ఒకే శారీరక, మానసిక, ఆత్మిక శక్తి ఉన్నది, కనుక స్త్రీలు పురుషులకు ఏమాత్రం తక్కువ కాదని ఉద్ఘాటించారు.

మహిళలకు విద్య, అతి ముఖ్యమైన సామాజిక బాధ్యత అని చెప్పారాయన. నిజానికి స్త్రీలలో ఉన్న విజ్ఞానం, ఆకళింపు శక్తి, సహనం, ఓర్పు, నిరాడంబరత్వం మగవారిలో ఉండవని ఆయన వాదించేవారు. అసలందుకే తన సత్యాగ్రహ ఉద్యమంలో స్త్రీ లే ప్రముఖ పాత్ర వహించగలరని భావించేవారు.

"సత్యాగ్రహం అంటే ఆయుధంతో చేసే యుద్ధం కాదు, దానికి వెంటనే

జయం, అపజయం అన్నవి లభించవు. ఈ శాంతియుత పోరాటంలో విజయం వచ్చేవరకూ, ఎంతో ఓర్పుతో, చివరివరకూ పోరాడాలి, ఇందుకు మహిళలే సరైన సైనికులు" అని గాంధీ చెబుతూ ఉండేవారు. "మహిళలకు ప్రవేశంలేని చట్టసభ ఏదైనా దానిని నేను బహిష్కరిస్తాను." అన్నారాయన. మూఢాచారాలను బహిష్కరించి, లింగ, వర్ణ, వర్గ రహిత సమాజం స్థాపనయే తన జీవితాశయం, తాను కంటున్న కల అని వివరించారు.

"మహిళలేమీ, ఆదర్శమైన భార్య, తల్లి అనే పాత్రలోనే తమను తాము చూసుకోవలసిన అవసరం లేదు. నిజానికి స్త్రీ ఎప్పుడూ సోదరిగా ఉండాలి. అప్పుడే ఆమె స్వచ్ఛమైన సేవ చేయగల సద్భావన అలవడుతుంది" అని గాంధీ చెప్పారు. నైతికంగా మారని సమాజం ఏమాత్రం పురోగమించినట్టు కాదని చెప్పారు గాంధీజీ.

"మహిళలను తక్కువగా, రెండవ శ్రేణి పౌరులుగా చూడడం అనేది నేరం. నాకు స్త్రీలపై సహానుభూతి ఉంది, జాలి లేదు. ఎప్పటికైనా మహిళ అంటే, పూర్తి శక్తి గల వ్యక్తిగానే నేను చూడాలనుకుంటున్నాను. దీనికి వేరెవరో అనుమతి ఇవ్వాలనుకోవడం మూర్ఖత్వం. ప్రతి మహిళ తన వ్యక్తిత్వాన్ని తానే నిర్మించుకోవాలి." అన్నారు గాంధీజీ. గాంధీజీ సంపూర్ణ మహిళా వికాసం కోసం జీవితకాలం కృషి చేసిన అరుదైన నాయకుడు.

ఉప్పు సత్యాగ్రహం సమయంలో సరోజిని నాయుడు అన్న మాట– " ముక్తి దాతకు జేజేలు." ఇది అక్షర సత్యం !

తన తల్లి, భార్య నుండి తాను నేర్చుకున్నది ఆత్మ విశ్వాసం, అసమానతపై పోరాటం అని గాంధీ చెప్పారు. మరి మన సమాజం ఈనాడు మహిళలను కనీసం మనిషిగానైనా పరిగణిస్తున్నదా? విద్యాసంస్థల్లో, ఉద్యోగాల్లో, క్రీడల్లో, చివరకు వినోదం పంచే చలనచిత్ర, కళా రంగాల్లో, ప్రతి చోటా వివక్షను మహిళలు ఎదుర్కొంటున్నారు.

ఈ సమస్యలపై చట్టం, న్యాయం, సమాజం, విద్యా విధానం ఏ పరిష్కారాలు చూపగలదు? పెచ్చరిల్లిన ఈ దురాగతాలకు బాధ్యత ఎవరిది? తిరోగమన దిశగా అడుగులు వేస్తున్న భారత సమాజం మరల ఎలా సంస్కరింపబడాలి? ప్రభుత్వం ఎలాంటి బాధ్యత వహించాలి? అన్నవి చర్చించవలసిన అంశాలు.



# కస్తూరీ సుగంధం

రెండు పాదాలు కలిసి ఒకే గమ్యం వైపు నడిచినట్టు, రెండు కళ్ళు కలిపి ఒక చూపు అయినట్టు, ఒక జంట ఒకటే ఆశయం కోసం చివరిదాకా కృషి చేయడం సాధ్యం అవుతుందా? సంప్రదాయాలకు పెద్దపీట వేసే రోజులలో మన భారతదేశంలో కుదురుతుందా?

భార్య తన భర్త కన్నా వయసులో ఏడు నెలలు పెద్దదై ఉంటే కూడా వీలవుతుందా? ప్రాథమిక విద్య సైతం లేని ఆ భార్య, సుమారు ఏభైవేల పుటలను వ్రాసిన భర్తతో కలసి పయనించడం, కాస్త వింతగా ఉంది కదూ! అయినా మరి, అలాగే జరిగింది. భారత జాతిపితగా పేరుపొందిన మోహన్‌దాస్ కరంచంద్ గాంధీ, ఆయన భార్య కస్తూరిబా గాంధీల నిజ జీవితగాథ ఇది. కొన్ని సార్లు నిజం విడ్డూరంగా తోస్తుంది.

కస్తూరి గుజరాత్‌లో, పోరుబందరులో బాగా సంపన్న కుటుంబమైన గోకుల్ దాస్, వ్రజ్ కున్వర్బా కపాడియా దంపతులకు, 1869 ఏప్రిల్11న జన్మించింది. కస్తూరి తండ్రిగారు, మోహన్ దాస్ తండ్రి మంచి స్నేహితులు కావడం వలన వాళ్ల స్నేహబంధం గట్టి పరుచుకోవడానికి, తమ పిల్లల వయస్సు ఏడు సంవత్సరములున్నప్పుడే పెళ్ళికి తాంబూలాలు పుచ్చుకున్నారు. పెళ్లినాటికి వారి వయస్సు 13 సంవత్సరాలు. అప్పటికి వాళ్ళిద్దరికీ, పెళ్లంటే బాజాలు, మిఠాయిలు అనుకునేంత లేత వయసు.

త్వరలోనే, గాంధీజీ కస్తూరితో ప్రేమ వ్యామోహంలో తలమునకలు అయ్యాడు. ఇది ఎంతగా అంటే, యువ మోహన్‌దాస్ కస్తూరిని ఆనేక విధాలుగా కట్టడి చేద్దామని ప్రయత్నంచేశారు. ఎప్పుడు, ఎక్కడికి వెళ్లాలన్నా, చివరకు దేవాలయానికి వెళ్లాలన్నా, ఎవరితోనైనా మాట్లాడాలన్నా తన అనుమతి తీసుకోవాలంటూ మోహన్ దాస్ చాలా ఒత్తిడి తీసుకు వచ్చేవారు. కానీ చిన్నారి కస్తూరి ఆయన మాటలను వింటేనా?! మోహన్‌దాస్ సిగ్గరి, మితభాషి. కాగా కస్తూరి సరదాగా నలుగురితో కలిసి ఆట పాటలు, ఇంటి పనులందు సమయం గడిపేది.

ఇదిలా ఉండగా, ఎలాగైనా తన భార్యకు చదువు నేర్పించాలని మోహన్ దాస్ పరితపించే వాడు. వారిద్దరికీ ఏకాంతం దొరకక, చివరకు రాత్రి తన గదికి వచ్చిన తరువాత పాఠం చెప్పాలని ప్రయత్నించేవాడు. అప్పటికే ఇంటి పనులతో అలసిపోయిన కస్తూరి ఏమి నేర్చుకోలేదు. పైగా నిద్రకు తట్టుకోలేక ఆవులిస్తూ ఉంటే గాంధీ చికాకు పడేవారు.

కస్తూరి 16 సంవత్సరాలకే తొలి గర్భం దాల్చగా, పుట్టిన బిడ్డ చాలా బలహీనంగా ఉండి, పురిటిలోనే చనిపోయాడు. 1888లో ఈ జంటకు హీరాలాల్ అనే మగబిడ్డ జన్మించాడు. ఈ బిడ్డ పుట్టిన కొంత కాలానికే, గాంధీ బారిష్టరు చదవడానికి లండన్ వెళ్ళాలని నిర్ణయించుకున్నారు. అప్పుడు 'బనియా' వంశంలో వీళ్ళ కుటుంబాన్ని వెలివేశారు. ఈ అవమానాన్ని భరించలేని పరిస్థితిలో, విదేశం వెళ్లవద్దని ఆ ఇల్లాలు బతిమిలాడింది. కానీ, గాంధీ తన పట్టు విడువలేదు. ఇది చాలా మామూలుగా జరిగిన విషయం. కానీ భవిష్యత్ జీవితమంతా మోహన్ దాస్ కరంచంద్ గాంధీ ప్రజా నాయకుడిగా తన ప్రతి నిర్ణయం కఠినంగా, ఏకపక్షంగా తీసుకున్న ప్రతిసారీ కస్తూరి తనను తాను సమాధానపరచుకుంటూనే గడపవలసి వచ్చింది.

ఆ సమయంలో కూడా, లండన్ ప్రయాణానికి భర్త దగ్గర డబ్బు లేదని తెలుసుకున్న కస్తూరి తన పెళ్లి నగలను కుదువ పెట్టమని గాంధీకి ఇచ్చింది.

గాంధీ లండన్ వెళ్ళాక కస్తూరికి ఉత్తరాలు తక్కువే రాశాడు. అయినా ఎలాగో తాను, తన బిడ్డ కాలం వెళ్ళదీసారు. లండన్ నుంచి వచ్చి, బొంబాయిలో వకీలు పని కొన్నాళ్లు చేసివచ్చాక, గాంధీ పోర్బందర్‌లో ఉండలేక, దక్షిణాఫ్రికాలో తన అదృష్టాన్ని పరీక్షించుకోవడానికి బయలుదేరి వెళ్లాడు. ఆ తరువాత కొన్నాళ్ళకే తన భార్యా బిడ్డలను దక్షిణాఫ్రికాకు తీసుకొని పోయాడు.

పాఠశాలలో ప్రాథమిక స్థాయి చదువు కూడా చదువుకోని కస్తూరి, చిన్న చిన్న ఇంగ్లీష్ పదాలను మాట్లాడుతూ, ఆ దేశంలోని భారతీయ సంతతి కుటుంబాలతో కలిసి పోయేది. కాస్తంత సంపాదన వచ్చిందయ్యా అనుకునే లోపు గాంధీజీ టాల్‌స్టాయ్ పుస్తకాలను, రస్కిన్ బాండ్ వ్రాసిన అన్ టు ది లాస్ట్ పుస్తకం చదివి సర్వోదయ మార్గాన్ని అనుసరించడం మొదలు పెట్టాడు.

అప్పటి నుంచి ఆయన, నిరాడంబరత, సరళ జీవనం అనే సూత్రాలను నిజ

జీవితంలో పాటించడం మొదలుపెట్టాడు. ఆ జీవితానికి అలవాటు పడేందుకు కస్తూరికి సమయం పట్టింది. ఇంటిపని చేయడమే కాకుండా, పిల్లల పెంపకంతో పాటు గాంధీ తన ఇంటికి తీసుకువచ్చే అతిథులకు ఆమె ఆతిథ్యం ఇచ్చింది. వీరు అనేక దేశాలకు, జాతులకు సంబంధించినవారై ఉండేవారు.

ఈ సమయంలోనే ఒక పర్యాయం, క్రైస్తవమతం తీసుకున్న ఒక హరిజనుడు ఇంటికి వచ్చాడు. ఆయన వాడిన మలవిసర్జన పాత్రను కస్తూరి శుభ్రం చేయవలసి వచ్చింది. ఇందుకు ఆమె నొచ్చుకుంది. అందుకు, గాంధీ ఆమెను కోప్పడ్డాడు. 'అంటరానితనం' మహా హీనమైన దురాచారమని చెప్తూ, ఆమెకు ఇష్టం లేకపోతే ఇల్లు విడిచి వెళ్ళిపొమ్మని, చెయ్యి పట్టుకుని లాగి, బయటకు తోసి దురుసుగా ప్రవర్తించాడు గాంధీ.

అప్పుడే మొట్టమొదటిసారిగా కస్తూరి ఆయనపై తిరగబడింది. ఒక విదేశంలో కట్టుకున్న భార్యను కట్టుబట్టలతో బయటకి పొమ్మనడం ఎంత తప్పు? అంటూ గాంధీని నిలదీసింది. కస్తూరి నిర్భయంగా నిజాన్ని చెప్పడమే సత్యాగ్రహం, సహాయ నిరాకరణ అనే ఉద్యమసూత్రాలకు ఊపిరి పోశాయని గాంధీ తన జీవితచరిత్రలో రాసుకున్నారు. అంతటి మహత్తరమైన ముద్ర కస్తూరి వేసినదా? లేక ఆ అద్భుతమైన సత్యదర్శనం గాంధీజీ పొందగలిగారా అన్నది మిలియన్ డాలర్ల ప్రశ్న.

నెమ్మదిగా, కస్తూరి తన భర్త చేపట్టిన ఉద్యమస్ఫూర్తిని అర్థం చేసుకుని ఆయనకు చేదోడువాదోడుగా నిలబడడం ఆరంభించింది. ఇది ఆమె తనకు తాను నచ్చచెప్పుకున్న వైనం ఆమె ధోరణిలో క్రమేణ వచ్చిన మార్పు.

1904 మార్చిలో, బ్యుబానిక్ ప్లేగు ప్రబలిన సమయంలో, దక్షిణాఫ్రికాలోని భారతీయ సంతతికి కస్తూరిబా చేసిన సేవలు మరువలేనివి. తనతో పాటు ఆరోగ్యవంతులైన ఇతర స్త్రీలను కూడా వాలంటీర్లుగా చేసి, పరిసరాల పరిశుభ్రతను గూర్చి ప్రజలకు అవగాహన కల్పించి, ప్లేగు బారినపడ్డ రోగులకు ఎన్నోవిధాల సేవలు అందించారు.

అక్టోబరు 1906లో, గాంధీజీ స్థాపించిన 'ఫినిక్స్' ఆశ్రమంలోకి తొలిసారి కస్తూరిబా అడుగుపెట్టారు. దాదాపు అప్పటినుంచి కస్తూరిబాకు తన స్వంత ఇల్లు అంటూ ఎప్పుడూ లేదు. భర్తతో ఆశ్రమంలోనే బ్రతకడం, నలుగురితో కలిసి వంటశాలలో వంటలు వండి, వడ్డించడం, పదుగురితో భోజనం చేయడం,

ఆశ్రమవాసుల విధులను, బాధ్యతలను తలకెత్తుకోవడం జరిగాయి. మహా ఇల్లాలు! ఆమె మానసిక పరిణతిని ఏమని పొగడగలం?

1907లో 'ట్రాన్స్ వాల్ రిజిస్ట్రేషన్ యాక్ట్' కు వ్యతిరేకంగా జరిగిన ఉద్యమంలో కస్తూరిబా పాల్గొన్నారు . 1908లో తొలిసారిగా గాంధీజీ అరెస్టు చేయబడ్డారు. ఆ సమయంలో కస్తూరిబా ఆయన జైలులో ఏమి తిన్నారో అదే ఆహారాన్ని తాను ఇంట్లో తిని, గాంధీ నాయకత్వానికి పూర్తి సహాయ సహకారాలను మనసా, వాచా, కర్మణా అందించడం మొదలు పెట్టారు.

కస్తూరిబా 15 సెప్టెంబర్ 1913లో ట్రాన్స్వాల్ సరిహద్దును దాటి స్వచ్ఛందంగా చట్టాన్ని ఎదిరించి, తన జీవితంలో మొదటిసారి అరెస్టయ్యింది. మారిస్‌బర్గ్ జైలులో తనతో సహా, 12 మంది మహిళా ఖైదీలతో ఆమె గడిపారు. అలా ఆ ఉద్యమం నూతన రూపాన్ని సంతరించుకుంది.

1913లో 22 డిసెంబర్‌న కస్తూరిబా జైలు నుంచి విడుదలయ్యారు. దక్షిణ ఆఫ్రికాలో ఈ విజయాన్ని భర్తతో ఆమె పంచుకున్నారు. ఈ సందర్భంలో కొందరు కొన్ని కానుకలను ఇచ్చారు. వాటిలో కొన్ని నగలు కూడా ఉన్నాయి. ఆ నగలను కస్తూరిబా మళ్ళీ ఉద్యమంలో పెట్టుబడిగా పెట్టడానికి సుముఖంగా లేరు. దీనికి గాంధీజీ సుతరామూ ఒప్పుకోలేదు. ఉద్యమస్ఫూర్తికి ఇది విరుద్ధమని, కానుకలను స్వీకరించరాదని గాంధీ పట్టుబట్టారు. దీనికి బాధపడినప్పటికీ, కొంత సమయానికి కస్తూరిబా గాంధీజీని పూర్తిగా అర్థం చేసుకున్నారు. ఆయన మాటల్లోని సత్యాన్ని గ్రహించి ఆ నగలన్నీ వెనుకకు ఇచ్చేశారు. ఈ ఉదంతంలో ఒక సాధారణ మహిళ నుంచి కస్తూరిబా ఎలా ఆశలను, కలలను కోరికలను వదిలేసి సత్యం వైపుకు ప్రయాణించారో మనకు అర్థం అవుతోంది.

కస్తూరి, స్త్రీ సహజమైన కోరికలను కలిగి ఉండడం తప్పు కాదు గాని, వాటిని జయించడం మటుకు, ఆమె పరమోన్నత విజయంగా చెప్పుకోవాలి. ఆ తరువాత మరెన్నెడూ కస్తూరిబా ఏ విధంగా తన గురించి, కుటుంబం గురించి గాంధీతో విభేదించినట్టు ఆధారాలే లేవంటే, ఆమెలో వచ్చిన మార్పు ఎంత నిలకడైనదో, పరిపూర్ణమైనదో మనం తెలుసుకోవచ్చు.

1914 జూలై లో కస్తూరిబా, గాంధీజీ కుటుంబంతో సహా భారత దేశానికి బయలుదేరారు.

ఘోషాలో పెరిగిన ఒక సాధారణ గుజరాతి మహిళ, యావత్ ప్రపంచానికి ప్రీతిపాత్రుడైన ఒక మానవతావాది భార్యగా మారడం అంటే మాటలు కాదు. 62 సంవత్సరాల సహజీవనంలో ఏనాడు ఎదురు చెప్పకుండా, గాంధీ వద్దకు వచ్చిన దేశ విదేశ నాయకులు, విలేఖరులు, కళాకారులు, తత్వవేత్తలు, అందరితో 'అమ్మ' అనిపించుకో గల అతి గొప్ప మహిళామణి కస్తూరిబా. స్వంత జీవితం, సంసారం, పిల్లలను గురించి ఎన్నడూ ఆలోచన చేయని ఆమె మనస్తత్వం ఎలా అంచనా వేయాలో ఊహించడం కష్టమే.

భారత స్వాతంత్ర్యసమరంలో కూడ కస్తూరిబా ప్రముఖమైన పాత్ర పోషించారు. తన భర్త అడుగుజాడలలో నడుస్తూనే భారతీయ మహిళలకు దిశానిర్దేశం చేశారు.

1917లో తొలిసారిగా బీహార్ లో, చంపారన్ నీలిమందు రైతుల ఉద్యమంలో కస్తూరిబా, తన కుమారుడు దేవదాస్ తో సహా వెళ్లి, ఉద్యమంలో పాలు పంచుకోవడం ఒక గొప్ప పరిణామం. ఇదే భవిష్యత్తులో జరిగిన అన్ని కార్యక్రమాలలో భారత మహిళలు ఉత్సాహంగా పాల్గొనేందుకు తొలి అడుగు. కస్తూరిబా చంపారన్ ప్రాంత రైతుల భార్యలతో 'జిల్లాస్థాయి పరిశుభ్రత ఉద్యమా'న్ని చేపట్టారు.

మహిళలు ఎప్పుడూ స్వతంత్రంగా ఉండి, తమ సంపాదన తామే సంపాదించు కోవాలని ఆమె చెప్పేవారు. దీని కోసమే చరఖాపై నూలు వడకడం చాలా ముఖ్యమని, అందరూ నేర్చుకోవాలని ఆమె చెప్పేవారు. ప్రతి సమావేశంలోనూ గాంధీజీ ప్రక్కన కస్తూరిబా కూడా కూర్చుని చరఖా తిప్పి, నూలు వడకటం ఒక గొప్ప స్ఫూర్తి దాయక, చిరస్మరణీయమైన, ముద్రను అప్పటి సమాజంపై వేసిందనడంలో సందేహం లేదు.

ఆపై కస్తూరిబా మహిళలకు, విదేశీ వస్త్రాలను బహిష్కరించాలని పిలుపు ఇచ్చారు. విదేశీ వస్త్రాలను బహిష్కరించడంలో తనకెంతో ఇష్టమైన చీరను కూడా బహిరంగంగా తగులబెట్టి, మహిళలకు ఆదర్శ ప్రాయులయ్యారు.

1922లో గాంధీని రాజద్రోహ నేరం కింద అరెస్టు చేసినప్పుడు 'యంగ్ ఇండియా' పత్రికలో, కస్తూరిబా తానే ఒక ప్రకటన చేశారు. ఇందులో ఆమె, భారతీయులను విదేశీ వస్త్రాలను, విదేశీ ప్రభుత్వాన్ని వారి వ్యాపారాన్ని కూలతోయాలని భారతీయ మహిళలకు పిలుపునిచ్చారు.

బ్రిటిష్ వారిచే నడుపబడే మద్యం దుకాణాల ముందు పికెటింగ్ నిర్వహించడంలో కస్తూరిబా ముందంజ వేశారు. పోలీసులు ఆడవారిని అరెస్టు

చేయడానికి సంశయిస్తారని గమనించి మద్యనిషేధం కోసం ఆడవారి సంఘటిత శక్తి ముఖ్యం అని ఆమె ప్రచారం చేశారు.

1932 జనవరి ఫిబ్రవరి నెలలో 'భారత పౌర హక్కుల చట్టం' తీసుకొనివచ్చి బ్రిటిష్ ప్రభుత్వం చాలా మందిని అరెస్టు చేసి చెరసాల పాలు చేసింది. అప్పుడే, తొలిసారి కస్తూరిబా కూడా సబర్మతి ఆశ్రమ ప్రాంతంలోనే అరెస్టు చేయబడ్డారు.

1932లో మద్రాసులో జరిగిన అంటరానితనం నిషేధం కోసం జరిగిన సభలో కస్తూరిబా కూడా సాహసంతో పాల్గొన్నారు. ఎందరో అగ్రవర్ణాల వారు కస్తూరిబాపై ఈ విషయంలో ఆ సంతృప్తి వెలిబుచ్చినా కూడా ఆమె వెనక్కి తగ్గలేదు. 1939లో రాజకోటలో ఠాకూర్ అనే ప్రాంతీయ రాజ సంతతి వ్యక్తి ఆడవారిపై అత్యాచారం చేస్తున్నాడని తెలిసి మహిళలంతా కలిసికట్టుగా ఈ దుశ్చర్యలను ప్రతిఘటించేందుకు, కస్తూరిబా తాను కూడా అక్కడకు వెళ్లారు. ఠాకూర్‌కు సంబంధించిన ప్రతినిధులు కస్తూరిబాను అరెస్టు చేశారు. చివరకు మార్చి 7న ఈ ఉద్యమం కొలిక్కి వచ్చి, మిగిలిన అందరితో పాటు కస్తూరిబాను కూడా విడుదల చేశారు. ఈ పూర్తిస్థాయి మహిళా ఉద్యమంలో కస్తూరిబా పాత్ర మరువలేనిది. ఆమె తోటి మహిళలకు స్ఫూర్తినిస్తూ నిలిచిన ఒక గొప్ప సంఘటన.

1944లో, పూనా, ఆగాఖాన్ ప్యాలెస్ యందు కస్తూరిబా మహాత్మునితో పాటుగా కారాగార జీవితాన్ని గడిపారు. ఊపిరితిత్తుల్లో నీరు, కఫం చేరి, న్యూమోనియా జబ్బుతో కస్తూరిబా 1944 సంవత్సరం ఫిబ్రవరి నెలలో 22 న గుండెపోటుతో 74 సంవత్సరాల వయసులో, భర్త చేతులలోనే మరణించారు. ఆమె చితి కాలినంతసేపూ గాంధీజీ అక్కడ నుండి కదలలేదు. " ఇంతకన్నా ఆమెకు నేనేం నివాళి ఈయగలను?" అన్నారాయన.

చితాభస్మంలో మిగిలినవి ఒక జత గాజు గాజులు మాత్రమే. మహాత్మాగాంధీకి తోడు, నీడగా నిలిచిన ఆదర్శ మహిళ కస్తూరిబా. గాంధీజీకి తోడుగా నిలిచిన స్త్రీ శక్తి కస్తూరిబా. పేరుకు తగ్గ అరుదైన పరిమళం కస్తూరిబా.



# సమగ్ర ఆరోగ్య ఉద్యమశీలి

ప్రపంచాన్ని శాసించిన అతి గొప్ప సామ్రాజ్యవాద సిద్ధాంతం బ్రిటిషువారి పాలనైతే, దానికి ఎదురు నిలిచిన విజయవంతమైన ఉద్యమకారుడు గాంధీ. మహాత్మా గాంధీజీకి ఆరోగ్యం, పరిశుభ్రత, పోషకాహారం పట్ల గల భావాలు, అవగాహన చాలా గొప్పవి. ఎంతగా అంటే ఈనాటి ఇరవై ఒకటవ శతాబ్దపు అదునాతన ఆరోగ్య సూత్రాల కు సశాస్త్రీయంగా, దగ్గరగా, ఉండే అభిప్రాయాలవి.

గాంధీ చెప్పిన ఒక్క వాక్యం మనందరినీ విస్మయ పరుస్తుంది, “ఆరోగ్యం, వెండి బంగారముల కన్న అసలైన సంపద. రుగ్మత వచ్చిన తరువాత మందులు బదులుగా అసలు అనారోగ్యం పడకుండా ఉండడం ఆవశ్యకం.” ఆయన ఆ సిద్ధాంతం సంపూర్ణంగా నమ్మారు.

ఆయన మరొక సందర్భంలో ఇలా చెప్పారు: “ మనిషికి కాళ్ళు, చేతులు ఉన్నవి భౌతికంగా తన శరీరాన్ని ఉపయోగించడానికి మాత్రమే! మరింక దేనికీ కాదు.” పెరిగిన ఆర్థిక స్తోమత, మారిన ఆహారపుటలవాట్లు, కాలినడక బదులుగా ఉపయోగించే రవాణా సౌకర్యాలు– ఇవన్నీ తెస్తున్న అధిక బరువు సమస్యలు గాంధీ ఉటంకించిన ఈ ఒక్క వాక్యంతో మరింత స్పష్టంగా అవగతం ఔతాయి.

1888,1908 సంవత్సరాలలో రెండు సార్లు మెడికల్ డిగ్రీ సంపాదించి పూర్తి స్థాయి వైద్యునిగా జీవితంలో స్థిరపడాలని ఆయన అనుకున్నారు.

అది సిద్ధించకపోయినా, గాంధీకి ఆరోగ్య సూత్రాలపై ఇష్టం ఏర్పడడానికి పునాదిగా చెప్పుకోవచ్చు. 1909 లోనే అప్పటి వైద్య విధానాలపై ఆయన ఒక విమర్శనాత్మక వ్యాసం రాశారు. పాశ్చాత్య రసాయనశాస్త్రంపై ఆసక్తి, సైన్యంలో ప్రాథమిక చికిత్స అందించే జట్లతో ఆయన పని చేయడం, పరిసరాల పరిశుభ్రత పై ఆయనకున్న అవగాహన ఇవన్నీ ఆయనకున్న అనుభవాలు. ఆహారం, వ్యాయామం, పరిశుభ్రత వంటి విషయాలపై ఆయనకున్న పట్టు సశాస్త్రీయమైనది. భార్య కస్తూరిబాకు

దక్షిణాఫ్రికాలో, పురిటి సమయం లో సహాయం చేసి, సుఖ ప్రసవానికి మంత్రసాని పాత్ర పోషించి, సహకరించడం ఒక గొప్ప ఆదర్శం.

ఆయన ("ఆరోగ్యానికి తాళంచెవి") 'కీ టు హెల్త్' అని ఒక పుస్తకం వ్రాశారు.

18 సంవత్సరాల వయసులో ఇంగ్లాండ్‌కు వెళ్లి వైద్యం చదవాలని అనుకున్నప్పటికీ అతడి అన్నగారు తాము వైష్ణవులు కావడంవల్ల శరీర నిర్మాణశాస్త్రం చదవడానికి, మానవ మృత కళేబరాలను ముట్టుకోవలసి వస్తుందని వద్దన్నారు. గాంధీజీ సర్వదా మానసికంగా, శారీరకంగా, బలహీనంగా ఉన్న తన తోటి వ్యక్తులకు మనో నిబ్బరం అందించడం, ఆహార నియంత్రణ, శారీరక శ్రమ గురించి బోధించే వారు.

సబర్మతి ఆశ్రమంలో, డాక్టర్ సుశీల నాయర్ పూర్తి స్థాయి వైద్యులుగా ఉన్నా, గాంధీ స్వయంగా అనారోగ్యం పాలైన తన సహచరులందరికీ భోజన సదుపాయాలు, పత్యంపై సలహాలు ఇవ్వడమే కాక, అమలు జరిగేలా ఎంతో శ్రద్ధ తీసుకునేవారు. ఈ పని అయేకనే ఆయన తన టపా, పత్రికలు చదువుకునే వారు.

రక్తపోటు కోసం ఒక ప్రత్యేకమైన వైద్య విధానాన్ని ఆయన అవలంబించడం ఎందరో చూశారు. అదేమిటంటే భూమి లోపలి పొరలలోని బంకమట్టిని తన పొట్ట పైన, తలపైన మన్నుపట్టుగా వేయించుకుంటు ఉండేవారు. 'సేవాగ్రాం' లో ఎప్పటికప్పుడు అయోడిన్, సోడియం బై కార్బోనేట్, వంటి మందుల వాడకం చేసేవారు. కుష్టురోగంతో బాధపడుతున్న పర్చురే శాస్త్రి, సంస్కృత పండితుడు సేవాగ్రాంకు వస్తే గాంధీగారు, "అందరిలా నేను నిన్ను వెలివేయను. నా అల్లుడు క్షయ వ్యాధితో బాధ పడితే అతడికి సేవ చేయనా? కనుక మీకోసం ప్రత్యేకమైన బస ఏర్పాటుచేసి, మా సేవాగ్రాం లోనే సేవలు అందిస్తాను" అని చెప్పారు. చేశారు కూడా.

ఫిబ్రవరి 1908 లో జనరల్ స్మట్స్ వచ్చినప్పుడు, కొందరు స్వదేశీయులే గాంధీని చితకబాదారు. అందుకు, కట్లుకట్టి అల్లోపతి వైద్యులు గాయాలను మాన్ప ప్రయత్నించగా, గాంధీ నిరాకరించి, తనకు తానే బంక మట్టిని తెప్పించి, తన వంటి మీద పట్లు వేయించుకుని, రెండు రోజులలో పూర్తిగా కోలుకుని పండ్లు తినే స్థాయికి వచ్చారు.

1908లో 'ఫినిక్స్' లో అనారోగ్యం పాలైన కస్తూరిబా గురించి తెలుసుకున్న వెంటనే జోహాన్నెస్‌బర్గ్ నుంచి గాంధీ హుటాహుటిన వెళ్లి, అపస్మారక స్థితిలో

ఉన్న కస్తూరిబా వద్దనే గడిపారు. గాంధీ గొప్పతనమంతా ఆమె కళ్ళు తెరిచినప్పుడు "నీ ఆరోగ్యం సన్నగిల్లిన దృష్ట్యా వైద్యుల సలహాల బదులు నేను వైద్యం చేస్తే అందుకు అంగీకరిస్తావా?" అని అడగడంలో ఉంది. దీనినే మనం ఇప్పుడు 'మౌఖిక అంగీకార పత్రం' (Informed consent) అంటున్నాము. 2 వారాలపాటు తన భార్య పక్కనే ఉండి, నిమ్మకాయరసం ఇస్తూ, ఎంతో ప్రశాంతంగా, సున్నితమైన సేవలను అందించి ఆమె అనారోగ్యం మొత్తాన్ని గాంధీజీ నెమ్మదింపచేసారు. ఆ తరువాత పళ్ళు, పాలు, కూరగాయల ముక్కలు ఇచ్చి ఆమెను రక్షించుకున్నారు.

ఇది విటమిన్ బీ 12 లోపం కావచ్చు. అయినప్పటికీ గాంధీ చూపిన ప్రశాంత సేవాతత్పరత వైద్యులు ఇచ్చే మందులతో పాటు ముఖ్యమని తెలియజేస్తోంది. గాంధీజీ కొన్ని మౌలిక సిద్ధాంతాలనే ఆరోగ్య సూత్రాలుగా నమ్మి ఆచరించారు. వాటిని ఆయన తన జీవితాంతం వదలకుండా ఇతరులకు ఉపదేశించారు కూడా.

**పెందలకడనే నిద్ర లేవడం రాత్రిపూట త్వరగా నిద్రకు ఉపక్రమించడం.** అన్ని హార్మోన్ల క్రమబద్ధీకరణకు ఇది ముఖ్యంగా ఉపకరిస్తుంది.

**పరిమితమైన ఆహారం భుజించడం:** "మనిషి యొక్క జీర్ణాశయం చెత్త బుట్ట కాదు ఆకలి ఉన్నా లేకున్నా నాలుక చెప్పిన రుచులను బట్టి ఏదో ఒకటి తినడం ఆరోగ్యానికి హానికరం", ఈ మాటలు ఆయన తానుగా ప్రవచించి ఆచరించారు.

ఈనాడు పాశ్చాత్య సంస్కృతి 'VEGAN' గా ఉండాలి అంటూ ప్రాచుర్యం లోకి తీసుకొని వచ్చిన ఆహార విధానం ఆయన 6 సంవత్సరాల పాటు తాను అవలంబించారు. ఇందులో కేవలం మొక్కలు, చెట్లు నుంచి వచ్చిన ఆహార పదార్థాలు మాత్రమే భుజిస్తారు.

**ఉపవాసం :** ఆయన ఉద్యమంలో ఇదీ భాగమనే అందరూ పొరబడతారు గానీ ఆయుర్వేద శాస్త్ర ప్రకారంగా వారానికి ఒకరోజు ఆహారం తినకుండా ఉండడం వలన జీర్ణరసాలు అన్ని సరైన మోతాదులో స్రవించి శరీరంలోకల నిరుపయోగంగా ఉన్న క్రొవ్వు పదార్థములను జీవరసాయన క్రియలో ఉపయోగింపబడేలా చేస్తుంది. శరీరంలోని కణజాలం అంతా డిటాక్స్ చేయబడుతుంది. అనగా కాలుష్య నిర్మూలన చేయబడుతుంది. గాంధీ చేసిన ఇరవై ఒక్క రోజుల ఉపవాస దీక్ష మరువలేనిది కదా.

**నడక:** గాంధీజీ చాలాసార్లు ఏ వాహనం ఉపయోగించకుండా నడక కొనసాగించే వారు. ప్రసిద్ధ దండీ మార్చ్‌తో  ఉప్పు సత్యాగ్రహంగా ప్రపంచంలో ఒక కొంగొత్త అధ్యాయం వ్రాసారాయన.

**పొగాకు, మద్యం సేవించకుండా ఉండడం :** స్వీయ నియంత్రణ విధానంలో పొగాకు, మద్యంలకు దూరంగా ఉండడం గాంధీ మార్కు నడవడిక. దీనితోపాటు బ్రహ్మచర్యం గాంధీజీ సందేశం.

**ధ్యానం :** గాంధీజీ ధ్యానాన్ని తన 'అంతరాత్మ పిలుపు' దొరికే అవకాశంగా భావించి తరచూ ధ్యానంలో గడిపేవారు. జటిలమైన సమస్యలు వచ్చిన కొద్దీ మరింత ఎక్కువగా ధ్యానంలోనికి వెళ్లి తద్వారా తన ఆలోచనలను కార్య-కారణ రూపంలో అమర్చుకుని ఏ పని చేస్తే ఏ ఫలితం వస్తుందోనని చక్కగా విశ్లేషించుకుని, అప్పుడే తన నిర్ణయాలను తీసుకుంటూ ఉండేవారు.

ఆయన వారానికి ఒక రోజు ప్రతీ సోమవారం పూర్తిగా మౌనాన్ని పాటిస్తూ తప్పనిసరి అయినప్పుడు చిన్న చీటీల పైన అతి తక్కువ మాటలతో సంభాషిస్తూ ఉండేవారు. తన విజయసూత్రం అదే  అని చెప్పడం చూస్తే గాంధీ మానసిక బలం మనకు అర్థమవుతుంది. ప్రపంచ ఆరోగ్య సంస్థ ప్రకారం "సంపూర్ణ ఆరోగ్యం అంటే మానసిక ఒత్తిడి లేని శారీరక ఆరోగ్యం."

**క్షమ :** "క్షమించడం అనేది బలం కలవారు మాత్రమే చేయగలరు" అని గాంధీజీ అంటూ ఉండేవారు. ఎల్లెడలా శాంతి నెలకొనాలంటే తనను తాను క్షమించుకుంటూ తన తప్పులను సరి దిద్దుకోవాలని, ఇతరులను క్షమిస్తు సామరస్యంతో మెలగాలని చెప్పేవారు.

ఈనాడు అధిక రక్తపోటు తగ్గడం లోనూ, హెచ్ఐవి పేషెంట్లలో  సి డి ఫోర్ కణజాలం పెరగడం లోని రోగ నిరోధక శక్తి పెరగడం లోను కోపం ఆందోళన అలసటలు పోవడమే ప్రముఖ పాత్ర వహిస్తున్నవని అనేక పరిశోధనలు తెలియజేస్తున్నాయి

**సహనం :** కంటికి కన్ను తీయాలని ఒక ప్రతీకార భావం ఉంటే ప్రపంచంలో అంధులే మిగిలేవారు అంటారు గాంధీజీ.  ప్రతీకారం స్థానే దయ, క్రోధం స్థానే సహనం చాలా అవసరం అంటారాయన.

**పరిసరాల పరిశుభ్రత :** "మనం నివసిస్తున్న ప్రదేశం కీటకాలకు ఆలవాలమై ఉంటే మనం అనారోగ్యంతో సహజీవనం చేస్తున్నట్టే" అని భావించేవారు గాంధీజీ. కాలకృత్యాలు తీర్చుకున్న వెంటనే పడక గది నుంచి పరిసరాల వరకు శుభ్రంగా తుడుచుకోవాలి అని, ఎవరి వంట వారే వండుకుని ఆ పాత్రలను తామే శుభ్రం చేసుకోవాలి అనేవారు. శ్రమైక సౌందర్యం, పరిమితమైన సామాను ఉపయోగించడం –వంటివి మంచి అలవాట్లు అని ఆయన నమ్మేవారు.

గాంధీజీ మరుగుదొడ్లను శుభ్రపరచడం అనేది నిమ్నజాతులను, హరిజనులను పూజించడం ఒక రాజకీయ ఎత్తుగడగా కాక, సరిగా ఆలోచిస్తే సామాజిక, వ్యక్తిగత క్రమశిక్షణ పరిశుద్ధ పరచడం వైపు వేసిన తొలి అడుగని అర్థమౌతుంది

**ఇంటిపని:** ఇంటి పనులలో ఆడ వారితో సమానంగా పురుషులు పాలుపంచుకోవాలని గాంధీ చెప్పడం తమ ఆరోగ్యం పట్ల పూర్తి అవగాహన కలిగి ఉండాలని వారికి సూచించడమే అని గమనించాలి. అప్పుడే స్త్రీ పురుషులు ఇద్దరూ తమ కుటుంబ ఆరోగ్యం పట్ల శ్రద్ధతో మెలగవచ్చునని గాంధీజీ అభిప్రాయం. గాంధీజీ వైద్యంలో చేసిన కొన్ని పరిశోధనలు ఎప్పటికీ అనుసరింపదగినవి. ఔషధాలను వినియోగించక్కర లేకుండా శుభ్రత పాటించడం, దురలవాట్ల బహిష్కరణ, ఆవుపాల బదులు మేకపాల వాడకం ఇత్యాదివి అని పేర్కొనవచ్చు.



# దేశ సమైక్యతకు పత్రికా వ్యాసంగం

"మంచి వార్తాపత్రిక అంటే నా అభిప్రాయం ఒక జాతి తనతో తాను మాట్లాడుకోవడమే" అంటారు ఆర్థర్ మిల్లర్. ఇందుకు చక్కని ఉదాహరణ మహాత్మా గాంధీ. ఆయన ఒక పాత్రికేయునిగా ఎలా నిరంతరం సమాజంతో మాట్లాడుతూ ఉండేవారో అన్నది ఆశ్చర్యం కలిగించే విషయం. లండన్, దక్షిణ ఆఫ్రికా, భారతదేశం ఎక్కడైనా, ఎప్పుడైనా గాంధీజీ పూర్తి స్థాయి పాత్రికేయునిగా జీవించారు. నిజానికి, భారత స్వతంత్ర పోరాట ఉద్యమ నాయకుని కన్న పాత్రికేయునిగా ఆయనకు ఉన్న అనుభవం ఇరవై ఏళ్ళు ఎక్కువ.

గాంధీ19 సంవత్సరాల వయసులో పై చదువుల కోసం లండన్ వెళ్ళినప్పుడు, అక్కడ వార్తా పత్రికలను చూసి వాటి క్రియాశీలపాత్రకు ఆశ్చర్యపోయాడు. అప్పటిదాకా తాను వార్తాపత్రిక చదవనేలేదని చిన్నబుచ్చుకున్నాడు కూడ. అక్కడ ఉండగా 'వెజిటేరియన్' అనే పత్రికలో మూడేళ్ల సమయంలో 9 వ్యాసాలను ప్రచురించగలిగాడు. ఇవన్నీ ఆహారపుటలవాట్లు, భారతీయ సాంప్రదాయ వంటకాలు, పండుగలు, పిండి వంటలు మొదలైన వాటి గురించి రాసినవి.

పాత్రికేయునిగా గాంధీ ప్రయాణం దక్షిణాఫ్రికాలో 'బోయర్ యుద్ధ' సమయంలో భారత స్వయంసేవకుల బృంద నాయకుడిగా ఉండగా, యుద్ధ విలేఖరిగా పనిచేయడంతో ప్రారంభమైంది. ఆ తరువాత బ్రిటిష్ ప్రభుత్వ విధానాలను నిరసిస్తూ వార్తాపత్రికలలో లేఖలు, వ్యాసాలు వ్రాసారు. గాంధీజీ ప్రవాస భారతీయుల సమస్యల గురించి మొదలు పెట్టిన పోరాటం ఉద్యమ స్థాయికి వెళ్ళడంతో జూన్ 4,1903న మొట్టమొదటి సారిగా 'ఇండియన్ ఒపీనియన్' అనే పత్రికను 'నాటల్' అనే పట్టణంలో తన సారధ్యంలో నెలకొల్పాడు.

ఆయన మొదటి సంపాదకీయం, ('మనం') ('అవర్ సెల్వ్స్'). ఇందులో ఆయన వాడిన భాష సరళమైన పదాలతో ఉంది. "ద్వేషాన్ని ప్రేమతో ఎదుర్కొనే ప్రయత్నమే సత్యాగ్రహం" అంటూ హరిత పత్రాన్ని గాంధీజీ వెలువరించారు. ఆ పత్రిక మొదటి పేజీ రంగు ఆకుపచ్చ కావడంతో దానికి ఆ పేరు వచ్చింది.

అప్పట్లో ఇంగ్లీషు, గుజరాతి, తమిళ భాషల్లో వచ్చిన ఈ పత్రిక కోసం గాంధీజీ వ్యాసాలను వ్రాయడమే కాక తాను కష్టపడి సంపాదించిన డబ్బును పత్రిక నిర్వహణ ఖర్చులకు వెచ్చించాల్సి వచ్చేది. చేతి తోటే బ్లాకులను సర్దుకుంటూ ముద్రించే ప్రెస్ యందు గంటల తరబడి గాంధీ పరిశ్రమించేవారని పోలక్ అనే సహచరుడు చెప్తారు. ఆ సమయంలో అక్కడ సహాయకులు, సేవకులు ఎవరూ ఉండేవారు కారు. సుమారు 11 సంవత్సరాల పాటు గాంధీజీ ఈ పత్రికను నిర్వహించారు.

గాంధీజీ ప్రతిసారీ, ప్రజలకు రావలసిన హక్కులను గురించే కాక పరిసరాల పరిశుభ్రత, పౌరుల బాధ్యత, వ్యక్తిగత క్రమశిక్షణ వంటి విషయాలను ప్రస్తావిస్తూ రాజకీయాలకు అతీతంగా వ్యాసాలు వ్రాసేవారు. అప్పటి ఆయన వ్యాసాలను గోఖలే, దాదాభాయి నౌరోజీ, రష్యాలో టాల్‌స్టాయ్ వంటి ప్రముఖులు ఎంతో ఆసక్తిగా చదివేవారట.

చాలా సంవత్సరాల తర్వాత 1916 లో తన రెండవ కుమారుడైన మణిలాల్ గాంధీని పోలక్ వద్దకు సహాయకునిగా పంపి, 'ఇండియన్ ఒపీనియన్' పత్రికకు తన వంతు సాయం చేశాడు. అప్పుడు మణిలాల్‌కు వ్రాసిన ఉత్తరంలో గాంధీ ఇలా ప్రస్తావించారు, "ఎప్పుడూ సత్యాన్ని అన్వేషించు. అందుకై బాగా సహనాన్ని చూపించు. ఎవరి పట్లా దురుసుగా ప్రవర్తించకు. కోపానికి బానిస కావద్దు. పత్రికలో వాడే భాష సరళంగా, సున్నితంగా ఉండాలి. ఎప్పుడైనా తప్పులు రాస్తే క్షమించమని అడగడానికి వెనుతీయకు."

గాంధీ, యువకులను పత్రికారంగంలోనికి ఆహ్వానించి, దేశానికి, సంఘానికి ఉపయోగపడే రంగంగా దీనిని గుర్తించమని చెప్పేవారు. 'ఇండియన్ ఒపీనియన్', 'నవ జీవన్', 'యంగ్ ఇండియా', పత్రికలు నడిపిన నేపథ్యంలో దాదాపు 30 సంవత్సరాల సంపాదకత్వ బాధ్యతలు నెరపిన పూర్తి స్థాయి పాత్రికేయుడు గాంధీజీ.

పాఠకుల హృదయంలోకి నేరుగా చేరవలసిన సత్యాలను వ్యాపింప చేయడానికి పత్రికలే సరైన మార్గమని గాంధీజీ నమ్మారు. సంపాదకీయం వ్రాయడానికి గాను, ప్రతిసారీ తనను తాను వెతుక్కుంటూ కొత్త ప్రతిపాదనలు సిద్ధం చేయగలగడం ఒక నూతనశక్తిని ఇస్తుంది అనే వారాయన.

1919 నుంచి 1931 వరకూ 'యంగ్ ఇండియా' వారపత్రికను,1919 నుంచి1947 వరకు నవజీవన్ పత్రికను తన క్రియాశీలక పథకాల గురించి వివరిస్తూ

చాల సమర్ధవంతంగా గాంధీ నిర్వహించారు. 1933లో 'హరిజన్' అనే మరొక పత్రికను నెలకొల్పారు.

పాత్రికేయులన్నా, సంపాదకులన్నా గాంధీజీకి సోదరభావం ఉండేది. గాంధీజీ దృష్టిలో పత్రికా విలేఖరి బాధ్యతంటే స్వరూప స్వభావాలలో మానవ ప్రకృతిని అతి దగ్గరగా పరిశీలించి, అధ్యయనం చేయడమే.

గాంధీజీ స్వీయచరిత్రలో, వార్తాపత్రికను నడపడంలో తన లక్ష్యాలను ఈ విధంగా రాసుకున్నారు:

1.ప్రజలలో ఉన్న భావాలను అర్థం చేసుకోవడం వాటికి అక్షర రూపం ఇవ్వడం.

2. అవసరమైన కొన్ని ఆలోచనలను ప్రజలలో అంకురించేలా చేయడం

3. నిర్భయంగా సమాజంలో, సమయానుగుణంగా ప్రభుత్వ విధానాలలో లోపాలను ఎత్తి చూపించడం

ప్రజల కోసం సహేతుకంగా పోరాడటంలో, ప్రజాభిప్రాయాన్ని సేకరించడంలో, పత్రికా రంగాన్ని చిత్తశుద్ధితో నడిపినట్టు గాంధీ జీవితాన్ని పరిశీలిస్తే మనకు తెలుస్తుంది.

బీహారు నీలిమందు రైతులు 'చంపారన్' లో గురౌవుతున్న ప్రభుత్వ దోపిడి గురించి తెలుసుకున్నప్పుడు, గాంధీ హుటాహుటిన అక్కడకు వెళ్లి, తన సహజ సిద్ధమైన పాత్రికేయ నైపుణ్యంతో, జరిగిన, జరుగుతున్న సంఘటనలను ఉటంకిస్తూ పరిశోధనాత్మకమైన నివేదికను తయారు చేశారు. దీనిని చదివితే, సామాజిక సమస్యల గురించి కృషి చేసే ప్రతి వ్యక్తి, సంస్థ అబ్బురపడేటంత స్పష్టతతో, నేటి ఆధునిక నివేదికలకు ఏ మాత్రం తక్కువ కాని విధంగా ఉందని గమనించవచ్చు.

తారీకులతో సహా, జరిగిన సంఘటనలను , రైతుల అసంతృప్తి, దానిని వారు ప్రకటించిన విధానం, ప్రజలు ప్రభుత్వాధికారులను కలుసుకున్న సందర్భాలు, సమర్పించిన వినతి పత్రాలు, దానికి ప్రభుత్వం ఇచ్చిన సమాధానాలు... వీటన్నింటినీ ఎంతో శ్రద్ధతో క్రోడీకరించి, సమస్య ఎలా జటిలమైనదో! అసలు ఉద్యమరూపం ఎందుకు దాల్చుతోందో సవివరంగా వ్రాసారు. ప్రభుత్వం విధించిన పన్ను వలన నష్టపోయిన ప్రజలెందరో, వారి జీవన ప్రమాణాలు ఏ విధంగా బలహీనపడ్డాయో సోదాహరణంగా వివరించిన ఆ నివేదిక, గాంధీజీ చూపిన ప్రామాణికతను చాటి చెపుతోంది.

యంగ్ ఇండియా, నవజీవన్‌లలో సమకాలీన సాంఘిక, ఆర్థిక, రాజకీయ పరిస్థితులపై అనేకమైన వ్యాసాలను, రిపోర్టులను, ప్రజలకు తెలియజెప్పే వార్తాకథనాలను గాంధీ వ్రాస్తూ ఉండేవారు. 1921 లో జరిగిన మొదటి సత్యాగ్రహం,1919 నుంచి 1924 వరకు జరిగిన ఖిలాఫత్ ఉద్యమం, 1924- గాంధీ అరెస్టు, హిందూ ముస్లింల మధ్య సంబంధాలు, 1930- దండి ఉప్పు సత్యాగ్రహం, 1931- రెండవ రౌండ్ టేబుల్ సమావేశం, గాంధీజీ ఐరోపా పర్యటన, ఇలాంటి ఎన్నో విషయాలను గురించి అవి బహుళ ప్రాచుర్యంలో వుండేవి. వీటిలో వ్యాపార ప్రకటనలను గాంధీజీ ఎప్పుడూ అనుమతించలేదు.

1910 'పత్రిక చట్టం' ను సవరించ వలసినదిగా గాంధీ చేసిన పోరు పాత్రికేయ రంగంలో ఒక ప్రత్యేకమైన సంఘటనగా మనం చెప్పుకోవచ్చు. "ప్రభుత్వం తన ఉనికి కోసమే ఈ చట్టాన్ని సవరించాలి", అని చెప్తూ, "న్యాయం, సత్యం ఈ రెంటిని కాపాడడానికి ప్రభుత్వం ఈ చట్ట సవరణ చేయాల్సి ఉంటుంద"ని చెప్పారు.

హరిజన్, హరిజన బంధు, హరిజన సేవక్ అనే పేర్లతో (వరుసగా)... ఇంగ్లీషు, గుజరాతి, హిందీ భాషలలో వెలువరించిన పత్రికలో గాంధీ అంటరానితనం, గ్రామీణ ప్రాంతపు పేదరికం అనే రెండింటిపై పెద్ద పోరాటమే చేశారు. సత్యం కోసం దేనినైనా ఎదిరించే గాంధీతత్వం పాఠకులను అబ్బుర పరిచేది.

"నా కోరిక సామాన్యులను చేరుకోవాలనే. ఇది కేవలం ప్రాంతీయ భాషా పత్రికల ద్వారా మాత్రమే సాధ్యం. నాది వ్యవహారిక గ్రామీణ భాష. నవజీవన్‌ను ట్యాక్సీ డ్రైవర్లు, కార్మికులు చదువుతారు. అది రైతులకు, నేతపనివారి గుడిసెలకు, చేరుకోవాలని నా కోరిక . అది వారి భాషలో ఉండాలని కోరుకుంటున్నాను. వారే భారత నిర్మాతలు." అని గాంధీజీ చెప్పేవారు. పాఠకులను పత్రికకు యజమానులుగా భావించమని ఆయన చెప్పేవారు. అక్షరదోషాలు కనిపిస్తే, వార్తలు సేకరించేటప్పుడు తప్పు జరిగితే, సాంకేతిక కారణాల వల్ల పత్రిక విడుదల ఆలస్యం జరిగితే దానికి సంపాదకుడే బాధ్యత వహించాలని ఆయన అనేవారు. ఆయన ఏ దేశంలో ఉన్నా రాయవలసిన వ్యాసం ఇవ్వడంలో ఆలస్యం, సంపాదకత్వం బాధ్యతలో జాప్యం వలన పత్రిక ముద్రణ ఆగిపోవటం జరగలేదు. కుడిచేయి నొప్పి పుట్టినప్పుడు ఆయన ఎడమ చేతితో రాసేవాడు. ఆయన ఎడమ చేత్తో రాస్తేనే ఆ దస్తూరీ చదవడానికి ఎక్కువ అనుకూలంగా ఉండేదట! అనారోగ్యం చేసినప్పుడు కూడా ఆయన వారానికి నాలుగు వ్యాసాలు రాసేవాడు.

స్వాతంత్ర్యోద్యమ ఖర్చులకు 'విరాళాలు సేకరిస్తున్నాము' అనే ప్రకటన, తగినంత సొమ్ము వచ్చాక "ఇక విరాళాలు వసూలు చేయబడవు" అని కూడ ఆ పత్రికలలో ప్రచురించడం జరిగేది. అంత పారదర్శకత బహుశా ఎక్కడా కానరాదు.

ఏ రకమైన లాభాలకు ఆశపడని పాత్రికేయత గాంధీ లక్షణం. పత్రిక నడపడం అంటే జీవనభృతి కోసం చేసే పనిగా కాక, సమాజం కోసం, ప్రజల కోసం చేసే ఒక సేవగా, నెరవేర్చే ఒక బాధ్యతగా, ఆయన భావించేవారు. "ప్రజాసంక్షేమం కోసం నడిపే పత్రిక నుంచి జీవనభృతిని ఆశించడం చాలా పెద్ద నేరం" అనేవారాయన.

పత్రికలు ప్రాథమికంగా ప్రజలను విద్యావంతులుగా చేసి, జరుగుతున్న చరిత్రతో మమేకం చేయాలి, అని నమ్మిన మనిషి గాంధీ. కఠోరమైన వాస్తవాలను ఎప్పుడు విస్మరించే వాడు కాదు. అనవసరమైన విశేషణాలు, అలంకారాలు భాషలో ఉపయోగించే వారు కాదు. సంపాదకుని పేరుపై వచ్చే లేఖల్లో తీవ్రమైన విమర్శలు వచ్చినా ప్రచురించేవారు. కానీ పేరు లేని లేఖలు అంటే మటుకు ఇష్టం ఉండేది కాదు. ప్రజల హృదయాలలో నిలబడి ఉండాలంటే విభిన్నమైన నిష్పక్షపాతమైన విధానాలను అనుసరిస్తూ పత్రిక నడపాలని చెప్పేవారు. ఆదాయం కోసం అనవసరమైన ప్రకటనలపై ఆధారపడితే సత్యదూరంగా వార్తలు వ్రాయాల్సి వస్తుందని ఆయన వాటిని వీలైనంత మటుకు నివారించే వారు. ప్రయోజనకరమైన ప్రకటనలను మాత్రమే ప్రచురించాలని సూచించేవారు.

సైలెన్ చటర్జీ అనే బెంగాలీ విలేఖరి, గాంధీజీతో తాను గడిపిన కొన్ని సంఘటనలను నెమరువేసుకుంటూ ఇలా చెప్పారు: "పూనా ఆగాఖాన్ పాలెస్‌లో నిర్బంధం నుంచి గాంధీజీ బయటకు వచ్చాక , రాజకీయ కార్యక్రమాలు ఎక్కువగా లేని రోజుల్లో నేను కొత్తగా వచ్చిన విలేఖరిగా పని చేసేవాడిని. టెలిగ్రామ్ ద్వారా వార్తలను పంపే రోజులవి. అపుడొకసారి నేను పంపబోతున్న నివేదికను నా చేత చదివించుకుని, 'ఇంత పెద్ద కథనం టెలిగ్రామ్‌లో పంపడం కష్టం కదా? దీనిని మనం ఎడిట్ చేద్దాం' అంటూ, ఎంతో సమర్థవంతంగా ఏ విషయాన్ని వదిలిపెట్టకుండా, నేను వ్రాసిన సమాచారాన్ని సంగ్రహంగా ఎలా వ్రాయాలో గాంధీజీ చూపించారు."

1947 స్వాతంత్ర్యం వచ్చాక చెలరేగిన మతకలహాల నేపథ్యంలో "ఒక రాత్రి –ఒక గ్రామం" నినాదంతో ఆయన "శాంతి యాత్రలు" పేరిట 'నౌక్కాలి' పట్టణం

(తూర్పు బెంగాల్), బీహార్ రాష్ట్రం, మద్రాసు, పళని, శ్రీనగర్– జమ్మూ, సిమ్లాలకు వెళ్ళారు. ఆయన ఆఖరుగా వెళ్ళిన లాహోరు, రావల్పిండి పర్యటనలకు, ఢిల్లీ, డెహ్రాడూన్ లలో ఆయన జీవిత చరమాంకంలో కూడా రైలులో ఎప్పుడూ మూడవశ్రేణి లోనే ఆయన ప్రయాణించే వారు. ఎన్ని పనులున్నా సంపాదకీయాలు, వార్తా కథనాలు వ్రాయడం మటుకు ఆయన హృదయానికి దగ్గరైన పని.

వార్తాపత్రికలను గూర్చి గాంధీజీ ఒక ఉపన్యాసంలో ఇలా అన్నారు. “వార్తా పత్రికను ఫోర్త్ ఎస్టేట్ అంటారు. ఇందులో ఎంతో శక్తి ఉంది. కానీ శక్తిని విద్రోహ కలాపాలకు వాడినప్పుడు అది నేరం అవుతుంది. బాధ్యతను నిర్వర్తించడానికి సత్యాన్వేషణ, సహనం చాలా ముఖ్యం.”

సంచలన వార్తా కథనాల పట్ల గాంధీ తన నిరసనను తెలియజేసేవారు. మత విద్వేషాలను ప్రేరేపించే విధంగా వార్తలు రాయకూడదని గాంధీ అభిప్రాయపడ్డారు. 28 మే, 1931 యంగ్ ఇండియా సంచికలో ‘విషపూరిత వార్తా కథనం’ (Poisonous Journalism) పేరిట ఒక వ్యాసం రాశారు గాంధీజీ. “వర్గ విభేదాలను పెంచే అవాస్తవాలను, రాజకీయ హింసను ప్రేరేపించే వ్యాసాలను నేను హత్యా కథనాలుగానే పరిగణిస్తాను. ఇలాంటివి ప్రచురించినప్పుడు సమాజంపై తీవ్రమైన ప్రభావం ఉంటుంది. దీనిని ప్రోత్సహించకూడదు. విలేఖరులకు నియంత్రణ, క్రమశిక్షణ అవసరం” అని.

మేధావులు గాంధీ పాత్రికేయ రచనలను ప్రజాహిత జర్నలిజం, శాంతికాముక జర్నలిజం, పురోగమన జర్నలిజం, నైతిక విలువలు గల జర్నలిజం అని భావిస్తారు.

శాంతి కాముక జర్నలిజం అంటే వార్తాకథనాలలో సమాజ భద్రతకు తోడ్పడే విషయాలను ప్రస్తావిస్తూ పరస్పర విరుద్ధ భావాలను వదిలిపెట్టడం.

పురోగమన జర్నలిజం అంటే, సంఘ పునర్వ్యవస్థీకరణకై కొత్త ప్రతిపాదనలు సిద్ధం చేయగలగడం. ఇలా గాంధీజీ చెప్పిన విషయాలు –

అంటరానితనం నిర్మూలన కోసం ‘హరిజన్’ పత్రికను పూర్తి నిబద్ధతతో నడిపిన “పురోగమన జర్నలిస్టు”గా గాంధీజీని చూడవచ్చు. “హిందూ సమాజంలో ఉన్న అంటరానితనం, వారు నమ్మిన భగవంతునికి కూడా వ్యతిరేకమే. మానవత్వానికి విషపూరితమైన దీనిని పూర్తిగా నిర్మూలించడమే నా ధ్యేయం”, అని ప్రకటించారు గాంధీ.

గాంధీజీ తన వ్యాసాల ద్వారా ప్రోత్సహించిన ముఖ్యమైన అంశం స్త్రీల ఆర్థిక, సాంఘిక బలహీనత. “బలహీనమైన, రెండవ శ్రేణి వ్యక్తిగా మహిళను గుర్తించడం మహానేరం, అన్యాయం. అహింసయే మన ముఖ్య ఉద్దేశ్యం అయితే భవిష్యత్తులో స్త్రీల పాత్ర ఎంతో ప్రముఖం” అని వ్రాసారు.

గాంధీ ప్రస్తావించి, సహేతుకంగా నిరూపించిన మరొక ప్రధాన అంశం గ్రామీణ పురోగతి. “భారతదేశం తన గ్రామాలలోనే జీవిస్తుంది. ఎప్పుడు గ్రామాలు స్వయం సమృద్ధి అవుతాయో, అక్కడ లభించే వనరులతో గ్రామీణజీవితం సుసంపన్నం అవుతుందో అప్పుడే ఆ దేశం అభివృద్ధి సాధించినట్టు లెక్క. అలా జరగని నాడు ఎంత అభివృద్ధి సాధించినా అది నిరర్థకం” అని చెప్పారాయన.

“సంపాదకీయం వ్రాయడానికి బాధ్యతాయుత అంకిత భావం ఉండాలి.”

What is really needed to make Democracy function is not the knowledge of facts but right education, and the true function of journalism is not to stock the public mind with wanted and unwanted Impressions. A journalist has therefore to use his discretion what to report and when.

“ప్రజాస్వామ్యం సరిగ్గా పని చేయాలంటే కావలసినది విషయ పరిజ్ఞాన మొకటే కాదు. మౌలికమైన విజ్ఞానం. పత్రికలు ప్రజలను ఎరుకగలవారిగా చేయాలి తప్ప, దుష్ప్రభావాలకు లోను చేయకూడదు. ఇలాగ చూసుకుంటే పత్రికా విలేఖరి ‘ఏ వార్తను ప్రచురించాలి, ఏది ప్రచురించరాదు’ అనే విషయంపై పూర్తి అవగాహన కలిగి ఉండాలి.”

గాంధీజీ ఎన్నో గ్రంథాలు పఠించారు. ఆత్మకథతో సహా ఆయన వ్రాసిన పుస్తకాలు, వ్యాసాలు, ఉత్తరాలు మొదలైనవన్నీ కలిపి, దాదాపు 50 వేల పేజీల పై చిలుకు ప్రచురింపబడి, “ది కంప్లీట్ వర్క్స్ ఆఫ్ గాంధీజీ” గా లభ్యమౌతున్నాయి.

పాత్రికేయునిగా గాంధీజీ అనుసరించిన సూత్రాలు నిబద్ధత, నిజాయితీ. ఈ రెండూ గాంధీ వేసిన ముందడుగుకు ఆనవాళ్ళు.



# కళలతో పరమావధి

మహాత్మాగాంధీ భారతదేశం గర్వించదగ్గ నాయకుడు. అంతకు మించి ఆయన ఒక విశిష్టమైన విశ్వమానవుడు. అటువంటి గాంధీజీ కళలను గూర్చి ఎలా ప్రతిస్పందించే వారో తెలుసుకుంటే ఆశ్చర్యకరమైన వివరాలు అవగతం ఔతాయి.

"సంగీతం గొంతులో నుంచి మాత్రమే వచ్చేది కాదు. నిజానికి సంగీతం అంటే మేధ–ఇంద్రియాలు–మనసు ఈ మూడింటి నుంచి వెలువడే ఒక గొప్ప విషయం" మహాత్మా గాంధీ పలుకులు ఇవి.

1926 ఏప్రిల్ 15న అహ్మదాబాద్ లో మాట్లాడుతూ ఆయన ఇలా అన్నారు "సంగీతం గురించి మనం మరింత విశాలంగా ఆలోచించాలి, అందలి లయ, శృతి, స్పందన ఈ మూడు లేకుండా జీవితంలో ఏ పనినీ చేయలేమని తోస్తుంది. అలా ఆలోచిస్తే ఏ తల్లిదండ్రులు తమ పిల్లలను సంగీతాభ్యాసం కోసం పంపిస్తారో వారు ఈ దేశ పురోగమనానికి దోహదపడే వ్యక్తులు కాగలరు."

'కళ కళ కోసమే' అంటే గాంధీజీ ఏకీభవించలేదు. " ఏ కళ మనిషిని సంస్కరించి విశాల దృక్పథం వైపు మరల్చగలదో అదే కళ అంటే" అన్నారాయన.

మరొక సందర్భంలో ఆయన ఇలా అన్నారు, "ఎందుకో గానీ, మనం సంగీతం అంటే ఒక పాట పాడడం, ఒక వాయిద్యాన్ని తగు నైపుణ్యంతో వినిపించడం అనుకుంటున్నాము. కానీ, నిజానికి సంగీతం అంటే ఏక తాళం, ఏకతారాగం. అది ఆ మనిషి హృదయ తంత్రులన్నిటినీ కలిపి ఒకే ఒక అపురూప స్వరంగా గానం చెయ్యడమే." ఎంత లోతైన భావన ఇది!

గాంధీజీ కూలంకషంగా చర్చించిన వాటిలో కళలు సైతం ఉన్నాయి. నిజానికి ఆయన దృక్కోణం మానవతా కోణం. ఆయన చెప్పిన మాటలు ఆ కాలపు ఎందరో కళాకారులను సైతం ఆశ్చర్యానికి గురిచేసాయి.

"నాకెందుకో, సంగీతమంటే చరఖా ఆడినప్పటి ధ్వనియే అనిపిస్తుంది. అలా స్వహస్తాలతో నేసిన ఖాదీ వస్త్రమే శృతి శుద్ధమైన సంగీతం అని తోస్తుంది ! యావత్

భారతావనిలోని కోట్ల మంది పౌరులు ఒకే పాట ఆలపించినపుడు, ఈ బంజరు భూముల నుంచి స్వేచ్ఛాగీతాలు ఉద్భవించినప్పుడు... అప్పుడే సంగీతం అనే ప్రయోగం సఫలమైనట్టుగా నేను భావిస్తాను." ఎంతటి మహత్తరమైన ఆకాంక్ష కదా ఇది!

1917 అక్టోబర్ 25 న జరిగిన రెండవ గుజరాత్ విద్యా సమావేశంలో ఆయన సంగీతం గురించి ఇలా చెప్పారు : "సంగీతం అంటే ఒక పవిత్రమైన, పురాతన కళా స్వరూపం. మనోభావాలను నియంత్రించడానికి, వాటిని సద్భావనలుగా మార్చడానికి కూడా అది ఉపయోగపడుతుంది. మనుషులు పెద్ద సంఖ్యలో ఒకచోట సమావేశమైనప్పుడు అక్కడ ఒక తెలియరాని అశాంతి, అలసట ఉంటాయి. దీనిని చక్కబరచడానికి ఒక పాటను పాడడం ఎంతో ఉపయోగకరం. ఉదాహరణకు బెస్తవారు తెప్ప నడిపే టప్పుడు, కార్మికులు శ్రమతో కూడిన పనిని చేసేటప్పుడు ఆలపించే పాటలలో ఎంతటి శ్రమైక సౌందర్యం అనుభవిస్తారో మనకు తెలుసు కదా! సంగీతమంటే లయ. నాకే గాని అవకాశం ఇస్తే స్కౌటింగ్ విద్యార్థులు, సేవా సమితిలో పాల్గొనే పిల్లలందరి చేత, సామూహికంగా, లయబద్ధమైన పాటలు పాడించి, వారందరినీ ఏకతాటిపై నడిపి వారి హృదయాలను శుద్ధపరచడం చేయాలంటాను".

మనసు, మేధ సరిసమానంగా సంయమనంతో వ్యవహరించే ప్రక్రియ కళ అని పై వాక్యాలు నిరూపిస్తున్నాయి.

గాంధీ దక్షిణాఫ్రికా ఆశ్రమంలో తొలి నాళ్ళలోనే సాయం సమయపు ప్రార్థనను ఆశ్రమ దినచర్యలో భాగంగా చేశారు. సబర్మతిలో పండిట్ ఎన్.ఎం.ఖారే, వినోబాభావే, బల్కోవాభావే, మామా ఫడ్కే వంటి ప్రముఖ సంగీతకారులు ఆస్థాన కళాకారులుగా ఉండేవారు. ప్రతి కాంగ్రెసు సమావేశంలోను పాటల ఆలాపన, వాద్యసంగీతం ఒక అంతర్భాగంగా ఉండేవి.

సబర్మతి ఆశ్రమంలో తరచుగా వినపడే పాటలలో ఏ విధమైన మత, కుల, వర్గ, ప్రాంత, భాషా భేదాలు ఉండేవికావు. ఎందరో కళాకారులు ఎన్నో రకాల గీతాలను ఎలుగెత్తి పాడుతూ ఉండగా, అదంతా ఎన్నో రంగుల, రేకల పూగుచ్ఛం శబ్దరూపంలో సదా వికసిస్తున్నట్లుగా అనిపించేది.

ఒకసారి ఆయన నవ యువకులను ఉద్దేశించి మాట్లాడుతూ, "మన జీవితమంతా తీయగా, లయబద్ధంగా ఒక పాటలా ఉండాలంటే– సత్యం, నిజాయితీ అనే రెండింటినీ నిత్య సాధన చెయ్యాలి. రాగద్వేషాలకు అతీతంగా సేవాతత్పరతను

ఆస్వాదించలేనివారికి ఈ విశ్వ సంగీత సౌరభం ఎప్పటికీ అవగతం కాదు. కళలు అంటే ఒక లోతైన అభివ్యక్తి. అలా కానిది కళ అంటే నేను ఒప్పుకోను."

గాంధీ గారిని ఒకరు, "మీ జీవితంలో సంగీతం పాత్ర ఏమిటి?" అని అడిగారు. దానికి ఆయన నవ్వుతూ, "నా చుట్టూ వున్న సంక్షోభం, ఒత్తిడితో నేనెప్పుడో ఎండుటాకులా కొట్టుకుపోయే వాడిని సంగీతం అనే ఒక విశిష్టమైన శక్తి నాకు తోడుగా ఉంది కాబట్టి ఇలా ఉన్నాను !" అని సమాధానం ఇచ్చారు.

ఆయన 'నితివం కవ్యో' పేరిట కొన్ని భజనలు, 'రామధున్' అనే ప్రార్థనాగీతం సేవాగ్రాంలో ఎప్పుడూ పాడిస్తూ ఉండేవారు. 'వైష్ణవ జనతో తేనే కహియతి' అనే పాటను ఎం.ఎస్. సుబ్బులక్ష్మి గారి గళంలో రికార్డు చేసి పంపించమని ఆయన స్వయంగా ఉత్తరం వ్రాసి మరీ పంపారు. హిందుస్థానీ సంగీతంలో తనకు అంతగా ప్రవేశం లేదు. గనుక ఈ భజన ఎలా పాడగలనో? అని సుబ్బులక్ష్మి గారు సందేహం వెలిబుచ్చారు. " మీ ఆర్ద్రత నిండిన గళంలో దానిని వచనంగా మాట్లాడినా నేను స్వీకరిస్తాను" అని ఆయన చెప్పారు. ఆ పాట ఎంత సౌహార్ద్రగీతమైందో అంతకు మించిన ప్రాచుర్యం కూడా పొందింది.

'సత్యం–అహింస' అనే రెండు రాగాలు, 'స్వదేశీ –ఖాదీ' అనే రెండు వాయిద్యాలు, 'నిస్వార్థం– బ్రహ్మచర్యం' అనే రెండు స్వరాలు, 'హింస–చౌర్యం' అనే రెండు నిషిద్ధ స్వరాలతో..... చరఖా తిప్పేటప్పుడు వచ్చేటి శబ్దమే సంగీతంగా మహాత్ముని స్వేచ్ఛాగీతం నిరంతరం సాగేది. అని గాంధీజీ గురించి డాక్టర్ నమ్రతా మిశ్రా గారు చెప్పిన మాటలు అత్యంత విలువైనవి. మనకందరికీ స్ఫూర్తిదాయకమైనవి.

నందలాల్ బోస్ అనే గొప్ప శాంతినికేతన్ కళాకారునితో గాంధీజీకి సత్సంబంధాలు ఉండేవి. ఆయన చేత కాంగ్రెస్ సమావేశాలకు సభాస్థలి రూపకల్పన, ప్రదర్శనల ఏర్పాటు చేయించడం గాంధీ కొనసాగించిన ఒక అలవాటుగా ఉండేది. 1936 లక్నో కాంగ్రెస్ సమావేశంలో నందలాల్ బోస్ భారతదేశ గ్రామీణ కళారూపాలను ప్రదర్శనగా అమర్చారు. వాటిని ఆయన స్థానికంగా దొరికే గడ్డి, మన్ను, కొబ్బరిపీచు, వెదురు, కాల్చిన మట్టి అంటే టెర్రకోటా వంటి ముడి పదార్థాలతో తయారు చేశారు. ఇవి గాంధీజీ మనసును దోచుకున్నాయి.

"ఈ కళారూపాలు ఒక నాటకం, సినిమా వలే చలన చిత్రాలు కావు. కానీ ఇదే, భారత దేశపు మౌలిక కళా స్వరూపం" అని గాంధీజీ ప్రశంసించారు.

కె. వెంకటప్ప అనే శాంతినికేతన్ విద్యార్థి గీసిన వర్ణచిత్రములు చూసి గాంధీజీ చాలా సంబరపడ్డారు." ఎంత విపులంగా ఈ ప్రకృతిలోని దృశ్యాలను రమణీయమైన రంగుల చిత్రాలుగా వేశారు మీరు? మీకు నా ఆశీస్సులు. కానీ, చరఖా ఏవిధంగానైనా మిమ్ములను ప్రభావితపరచగలదా? ఒక సగటు గ్రామస్థుని జీవితాన్ని చరఖా ఎంతగా అర్థవంతం చేస్తుందో... మీరేమైనా తెలుసుకోగలిగితే దాన్ని కూడా ఒక చిత్రంగా మీరు చేయగలరేమో ప్రయత్నించండి." అని అభ్యర్థించారు.

1930లో రౌండ్ టేబుల్ కాన్ఫరెన్స్‌కు వెళ్ళిన గాంధీ లండన్లో ప్రసిద్ధ అమెరికన& అమెరికన్ శిల్పి జో డేవిడ్సన్‌ను కలుసుకున్నారు. అప్పుడు అతడు తయారుచేసిన శిల్పాల ఛాయా చిత్రాలు గమనించి, "అబ్బో! మీరు మట్టినుంచి హీరోలను సృష్టిస్తున్నారే!" అని అభినందించారు. అక్కడి కొందరు చిత్రకారులు గాంధీ రేఖాచిత్రాన్నే వేయడానికి వచ్చి, "క్షణక్షణం మారిపోయే ఒక మానవ రూపమే గాంధీ" అన్నారట.

స్వాతంత్ర్యం రాక మునుపే 'జాతీయ గ్రామీణ పరిశ్రమ సమాఖ్య' ను ఏర్పాటు చేయాలని గాంధీ కలలు కన్నారు. దాని ద్వారా గ్రామీణ కళలను పునరుద్ధరించాలని, వాటివల్లనే గ్రామ ప్రజలు వ్యవసాయ పనులు పూర్తి అయ్యాక ఉండే తమ విరామ సమయాన్ని సద్వినియోగ పరుచుకోగలరని నమ్మారు గాంధీజీ.

1938లో 'పతువా' రీతిలో పూనా కాంగ్రెసు సమావేశం స్థలాన్ని నందలాల్ బోస్ రూపొందించారు. 83 ఫ్రేములలో చేయబడిన ఆ ప్రదర్శనను చూసి, గాంధీజీ ముగ్ధులయ్యారు. శాంతి నికేతన్‌లోని కళాభవన్ యందు అవనీంద్రనాథ్ ఠాగూర్ చేసిన బొమ్మలను చూసి ఎంతో సంబరపడి, గాంధీజీ తన సెక్రటరీ ప్యారేలాల్ ద్వారా అంత్య దశలో ఉన్న అవనీంద్రనాధ్ ఠాగూర్‌కు తన వ్యక్తిగత సందేశాన్ని ఇలా అందజేశారు, "మీరు ఆయురారోగ్యాలతో కలకాలం నిలచి మరిన్ని సుందరమైన కళాకృతులను చేయాలి" అని. దానికి ఆయన ఎంతో సంతోషించారట.

గాంధీజీ దృష్టిలో సత్యం, శ్రమ, సౌందర్యం ఒకదానితో ఒకటి పెనవేసుకున్న విషయాలు. రసాత్మకత లేని పని వ్యర్థమనీ, ఎవరికి వారు కళా సౌందర్యం, నైపుణ్యం తమ దైనందిన కార్యాలన్నిటిలో అవలంబించాలని ఆయన అభిప్రాయం .

"ఒక వ్యక్తి సంతోషం వారి బహిరంతరాలలో కానవచ్చే ఉల్లాసం. అలాంటి లక్షల హృదయాల ఆనంద క్షణాలను వ్యక్తీకరించేదే కళ" అంటారాయన. ఒక సమాజాన్ని దృష్టిలో ఉంచుకుని కళను నిర్వచించిన మహనీయుడు గాంధీజీ.



# ఈ పిరికి బాలుడే మహాత్ముడు

**బా**ల గాంధీ చాలా పిరికివాడు. చీకటిలో దెయ్యాలు, భూతాలు చుట్టుముట్టి, హాని చేస్తాయని అతడి భయం. అప్పుడు కాలకృత్యాలు తీర్చుకునేందుకు సైతం వణికిపోయేవాడు. వాళ్ళింట్లో పనిచేసే 'రంభ' అనే సహాయకురాలు అతడికి ధైర్యం నూరిపోసేది. "రామ నామం జపించే వారి దరిదాపులకు ఏ దుష్టశక్తులు రావు" అని చెప్పింది. అప్పటి నుంచీ బాలగాంధీ రామనామం పఠించేవాడు.

గాంధీపై ప్రభావం చూపిన మరో మహిళ తల్లి పుతలీ బాయి. ఆమె ఎన్నో వ్రతాలు, నోములు చేసేవారు. భక్తి శ్రద్ధలతో చాతుర్మాస దీక్ష అవలంబించేవారు. సూర్యదర్శనం కానిదే భోజనం చేయరాదని నియమం. "మబ్బుల మాటున దాగిన సూర్యుడెప్పుడు వస్తాడోనని పిల్లలం ఎదురు చూసేవాళ్ళం" అంటారు గాంధీ. అలా వచ్చినప్పుడు తల్లిని పిలుచుకొచ్చే లోపు, మరల మేఘావృతమైతే, "ఈరోజు భగవంతుడు పూర్తి ఉపవాసం చేయమన్నాడు" అంటూ, ఆమె నవ్వేవారట. 'మోయినా' అని ముద్దుగా పిలిచే తల్లి నుంచి, జీవించేందుకు దైవభక్తి, నిబద్ధత ఆవశ్యకం, కేవలం ఆహారమే కాదని గాంధీ గ్రహించారు.

తండ్రి మరణించాక, గాంధీ బారిష్టరు చదువుకై లండన్ వెళ్లాలనుకున్నారు. అక్కడికి వెళ్లినవారు మాంసం, మద్యం సేవిస్తారనీ, స్త్రీ లోలురౌతారని, పుతలీబాయ్ విని ఆందోళన చెందారు. ఆ మూడింటికి "ఎన్నడూ లోబడన"ని ప్రమాణం చేసాకనే, ఆమె గాంధీకి అనుమతి ఇచ్చింది. ఈ శపథాలను మళ్లీ మళ్లీ గుర్తు చేసుకుని ఇచ్చిన మాటకు కట్టుబడి ఉండే శక్తి తల్లి వలనే అలవడిందని ఆత్మకథలో గాంధీ ప్రస్తావించారు.

గాంధీ ఆటపాటలను, చదువును తండ్రి కాబా గాంధీ గమనించేవారు. ఒకసారి, కోయిల గొంతు వినబడితే దీక్షను విరమించే నియమంతో, ఆయన ఉపవాసం చేశారట. బాలగాంధీ పొదల మాటుకు వెళ్లి, కోయిలను అనుకరించారట. బిడ్డకు తనపై ఉన్న ప్రేమ కన్న , అతడు చెప్పిన అబద్ధానికి ఆయన బాధపడ్డారు.

కోప్పడి, గొడవ చేయలేదు. "నీవు అసత్యమాడినందుకు నేను మరో రెండు రోజులు ఉపవాసం కొనసాగిస్తాన"న్నారు. బాల గాంధీ ఎట్టి పరిస్థితుల్లోనైనా నిజమే చెప్పాలని అపుడే నిశ్చయించుకున్నారు.

కౌమార దశలో గాంధీ ఒకట్రెండు సార్లు తండ్రి జేబులో సొమ్ము కాజేసి, ధూమ పానం, మాంసం తినడం చేశారు. కానీ, సత్యహరిశ్చంద్ర నాటకం చూసాక, పశ్చాత్తాపంతో తప్పు ఒప్పుకుని క్షమించమంటూ ఉత్తరం వ్రాసారట. అది చదివిన తండ్రి దుఃఖిస్తూ, మౌనంగా ఉండిపోయారే తప్ప, గాంధీని ఏమీ అనలేదు. తప్పు చేసిన వారిలో పరివర్తన రావాలంటే శిక్షించే బదులు, ఆ తప్పు పట్ల అవగాహన కలుగ చేయాలన్న 'యూనివర్సల్ ట్రూత్' ఆ రోజు తనకు తెలిసిందంటారు గాంధీజీ. శిక్ష విధించడం వల్ల నేరమే గుర్తుంటుంది. అదే పరివర్తనకు అవకాశం ఇస్తే, వ్యక్తి ఆత్మ పరిశీలన చేసుకుంటాడని గాంధీ గ్రహించారు.

గుజరాత్‌లో తులసీ రామాయణ కథ, శ్రీరాముడు 'మర్యాదా పురుషోత్తముడ'న్న భావన ప్రాచుర్యంలో ఉండేవి. వ్యక్తత వచ్చాక గాంధీ బైబిలు, ఖురాను, సిక్కు, యూదు మత గ్రంధాలను పఠించారు. "నాకు రాముని వలెనే, ప్రతి మతంలో ఆదర్శ పురుషుడుంటాడు". "మనం చెప్పే కథల్లో ఆదర్శ పురుషులు ఏ సూత్రాలు, నియమాలను అవలంబించారో చెప్పకపోతే, నిజజీవితంలో వారిలా ఉండే సంకల్పం పిల్లలకు రాదు" అంటారు గాంధీ. ఆధ్యాత్మికతను జీవనశైలితో జతచేసి, సంయమనం సాధించిన నాయకునిగా గాంధీజీ రూపొందారు.

సాధారణంగా, చిన్నప్పటి భయం పెద్దయ్యాక 'ఫోబియా' అంటే 'బెరుకు' గా మారుతుంది. తీవ్రమైన క్రమశిక్షణ, గృహ హింస అనుభవించిన పిల్లల్లో గుబులు, ఆత్మ న్యూనతా భావం గూడు కట్టుకుంటాయి. అవి భయంగా మారి, పెరిగాక మానసిక సంఘర్షణకు దారి తీస్తుందని మానసిక శాస్త్రవేత్తలు ప్రతిపాదించారు. ఈ నేపథ్యంలో గాంధీ చిన్నప్పటి అనుభవాలు ఎలా ఆయన వ్యక్తిత్వాన్ని మలచాయో గమనార్హం.

'హింస' అంటే కోపం, అజ్ఞానం అంటారు గాంధీజీ. అవగాహన లేనప్పుడు వచ్చే క్రోధమే హింసగా మారుతుంది. ఒకరి మంచి మరొకరికి చెడు కావచ్చు, కానీ సత్యం అందరికీ ఒక్కటే. ఒకరి ప్రవర్తన మరొకరికి విపరీత ధోరణి కావచ్చు కానీ, ఒక వ్యక్తి ప్రవర్తనను 'అతడి' దృష్టికోణం నుండి పరిశీలించే సహనం మనలో రావాలి .

ఈ దృక్పథం మానవ హక్కుల ఉద్యమానికి నాంది పలికిన మహోత్కృష్ట వాదం. దీనికి ఉదాహరణ గాంధీ జీవితంలో మనకు దొరుకుతుంది.

1897లో గాంధీ తన కుటుంబంతో దర్బన్ నౌకాశ్రయం చేరారు. అంతకుముందు, అక్కడి పారిశ్రామికవేత్తలకు వ్యతిరేకంగా ప్రసంగాలు, పత్రికా వ్యాసాలతో చర్చలు, ఉద్యమం గాంధీ లేవదీసారు. కార్మిక సంక్షేమం కై పనిచేసారు. అందుకు కక్ష సాధింపుగా ఆ యజమానులు గాంధీని నౌకాశ్రయంలోనే అటకాయించి, దాడి చేసే దుండగులను పంపారు. వారు గాంధీని చితక బాదారు. ఆ అల్లర్లపై దర్యాప్తు చేస్తూ, నేరస్తులను గుర్తించమని పోలీసులు కొందర్ని ప్రవేశపెట్టారు. గాంధీ అందుకు నిరాకరించారు "Let us break this crime and punishment cycle!" నేరము,శిక్ష అనే వలయాన్ని ఛేదించాలి. తమ యాజమాన్యం ఆదేశాల ప్రకారం దాడి చేశారే తప్ప మా మధ్య వ్యక్తిగత కక్షలేం లేవు. వారు నేరస్తులు కారు. వారిపై కోపం రాకుండా నన్ను నేను పవిత్రంగా ఉంచుకోవాలని ప్రయత్నిస్తున్నాను. నేను దెబ్బలకు ఓర్చుకుంటాను. అవి మానిపోతాయి." అని గాంధీ చెప్పారు. ఆ సంఘటన తర్వాత, దాడి చేసిన వ్యక్తులే, గాంధీకి వ్యక్తిగత రక్షకులుగా మారడం అబ్బురపరచే సత్యం.

గాంధీ జీవితంలో పలుమార్లు దాడులు, సుమారు ఎనిమిది హత్యా ప్రయత్నాలు ఎదుర్కొన్నారు. అయినా ఏనాడు అహింసను వదల్లేదు. నేరారోపణ చేయలేదు." నాకు బాధగా ఉంద"ని కూడా అనలేదు. "అహింస ఒక జీవన విధానం. ఉదయం వేసుకుని సాయంకాలం విప్పేసే కోటు కాదు. ప్రేమ, గౌరవం, అవగాహన, మెచ్చుకోలు అన్నీ అహింసలో భాగాలే!" అన్నారాయన. శత్రువును పూర్తిగా అంగీకరించేందుకు, మానసిక, ఆధ్యాత్మిక దృఢత్వం ఉండాలి. ప్రత్యర్థి క్రూరత్వాన్ని సహనంతో, ఆవేశాన్ని క్షమతో, అజ్ఞానాన్ని అవగాహనతో జయించడమే అహింసా మార్గం. "కంటికి కన్ను బలి తీసుకోవడమే సరైనదైతే ప్రపంచమంతా ఏనాడో గుడ్డిదైపోయేది" అన్న గాంధీ నిస్సందేహంగా విలక్షణ నాయకుడు.

" వస్తువులను వృధా చేయడమూ హింసే. వస్తువులు, వనరులు అవసరానికి తప్ప విలాసాలకు కాదు" అంటారాయన. దీనిని నిరాడంబరత అనకుండా 'అహింస' అనడం గాంధీ ప్రత్యేకత. ఏ కనీసావసరాలు అందక సామాన్యులు బాధ పడుతున్నారో వాటిని ధనికులు అలవోకగా వృధా చేస్తే, నిరుపేదలలో కోపం, అశాంతి పెరిగి నేరప్రవృత్తి ఆవిర్భవిస్తుంది". ఇది గాంధీజీ ప్రతిపాదించిన వినూత్నమైన ఆలోచన.

గాంధీ కాలంలోనే హిట్లర్ జీవించాడు.ఆయన బాల్యాన్ని పరిశీలిస్తే బాధాకరమైన నిజాలు తెలుస్తాయి. అడాల్ఫ్ హిట్లర్ ,అతడి అన్నయ్య తమ తండ్రి చేతిలో దారుణమైన హింస అనుభవించారు. ప్రతిరోజూ కొరడా దెబ్బలు తినడమే. 11 సంవత్సరాల బాల హిట్లర్ తన తండ్రి 32 కొరడా దెబ్బలు కొట్టినా ఒక్క కన్నీటిబొట్టు కార్చకుండా రాయిలా నిలబడి, తన ఉద్వేగాలను నియంత్రించుకునే వాడట.

తండ్రిని ఎదిరించలేక బాల హిట్లర్ పంతం కొద్దీ బాధను వ్యక్తం చేయలేదు. అలా మనసులో గూడుకట్టుకున్న బాధే హిట్లర్ లో ద్వేషం, ఆత్మన్యూనత గా మారి, జాత్యహంకారంతో అతి పెద్ద (జినో సైడ్) మారణహోమం సృష్టించిన యుద్ధ విధానంగా పరిణమించిందని నిపుణులు చెబుతున్నారు.

గాంధీ మహాత్మునిగా ఎదిగిన క్రమంలో బాల్యం, ఆ పై ఆయన తన వ్యక్తిత్వాన్ని తీర్చి దిద్దుకున్న తీరు విశిష్టమైనవి. స్వాతంత్ర్యం అంటే స్వేచ్ఛ, సత్యాన్వేషణ. ఆ క్రమంలో రాజకీయ నాయకులు దోపిడీ, అణచివేత అవలంబిస్తే తిరోగమనం, అస్థిరత నెలకొంటాయి.

ప్రముఖ ఆంత్రోపాలజిస్ట్ మార్గరెట్ మీడ్ ను "నాగరికత ఎప్పుడు మొదలైంది? చక్రం కనిపెట్టడంతోనా? వ్యవసాయంతోనా?" అని అడిగారు. "ఎప్పుడు తొలిసారి ఒక మనిషి తొడ ఎముక విరిగిందో ఆరోజున నాగరికత మొదలైంది" అన్నారామె.

ఆశ్చర్యంగా ఉంది కదూ?!

అప్పటిదాకా, ఏ కారణం చేతనో తుంటి ఎముక విరిగిన జంతువు ఆహారం సంపాదించుకోలేక, ఆత్మ రక్షణ చేసుకోలేక చనిపోయేది. కానీ, "దెబ్బ తగిలిన మనిషిని చుట్టుపక్కల వారు కాపాడి, చేతనైన వైద్యంతో ఆరోగ్యం సిద్ధించే వరకు రక్షించినపుడు, తొలిసారి మనిషి నాగరికుడైన క్షణం. అలా మానవుడు పశువు నుంచి వేరు పడ్డాడు" అని ఆమె చెప్పారట.

సత్యం, అహింసలను సంపూర్ణంగా అవగతం చేసుకుంటే, మానవుడు నాగరికునిగా, సంస్కారవంతునిగా ఆవిర్భవిస్తాడు. అనేక సామాజిక రుగ్మతలకు మూలం బాల్యంలో ఎదురయే అనుభవాలు. అందుకే ఒక దేశంలోని బాలల అభ్యున్నతి ఆ దేశ ప్రగతి అని గుర్తించాలి.



# నవతరానికి రోల్ మోడల్

దార్శనికత, ధైర్యం, సామర్థ్యం, విషయావగాహన, కలుపుగోలుతనం, పోరాటపటిమ అనేవి నాయకత్వ లక్షణాలుగా చెప్పుకుంటాం. ప్రతి సమాజం, దేశం సంక్షోభ సమయంలో తీవ్రమైన ఒత్తిడికి లోనౌతుంది. వ్యక్తికి వలే సమాజానికి కూడా ఒక మానసికశక్తి ఉంటుంది. అది దెబ్బతిన్నప్పుడు మార్పు అనివార్యం. ఆ మార్పును ఆవిష్కరించే యుద్ధాన్ని ముందుండి నడిపించే వారే నాయకులు.

వీరిని అధిక సంఖ్యాకులు అంత త్వరగా ఆమోదించరు . అధికార యంత్రాంగం సహించదు. ఒకోసారి శిక్షించవచ్చు, మరణదండన విధించిన సందర్భాలు కూడా ఉంటాయి. కానీ, చివరకు ఆ సమాజమే ఆ నాయకులను అనుసరించి, వారి స్ఫూర్తితో కొత్త బాటలో పురోగమిస్తుంది.

సోక్రటీస్, గౌతమబుద్ధుడు, లెనిన్, మార్క్స్, టాల్‌స్టాయ్, సామ్యూల్ ఆడమ్స్, అబ్రహాంలింకన్ వంటివారి  స్థాయిలో ప్రపంచ సమాజగతినే నూతన పథంలో నడిపించిన మహానాయకుడు మోహన్‌దాస్ కరంచంద్ గాంధీ. ఈ నాయకులందరూ అసమానత, అణచివేతలను ఎదుర్కోవడమే చేస్తే వీరు కూడా సంస్కర్తలుగా మిగిలిపోదురు. కానీ, ఈ నాయకులు మానవజాతి మనుగడకు ఒక కొత్త అర్థం, పరమార్థం నిర్వచించిన మహనీయులు. అందుకే, వారు విశిష్ట వ్యక్తులయ్యారు.

నాయకుడంటే ఒక పార్టీకో, వర్గానికో, వ్యాపార సంస్థకో చెందిన పరిమిత పరిధి లో 'టీమ్ లీడర్' గా  కాక, ఒక దేశం తద్వారా యావత్ మానవాళి శ్రేయస్సును తమ గమ్యంగా నిర్దేశించుకున్న వారని  విస్తృత పరిధిలో నిర్వచించుకోవాలి.

సమస్యను అర్థం చేసుకుంటే పరిష్కారం దిశగా అన్వేషణ మొదలౌతుంది. అలా పరిమితులకు లోబడక సమస్య ఉత్పన్నమైన కారణం ఏమిటో తెలుసుకుంటేనే ఆలోచనా దృక్పథం విశాలమౌతుంది. ఈ సూత్రం ఒక వ్యక్తి అర్థం చేసుకుని, తనను తాను మలచుకోవడమే సాధారణంగా కష్టం, అరుదుగా మాత్రమే జరుగుతుంది. అలాంటిది, ఒక సమాజం మొత్తం మారాలంటే? అది బాగా జటిలమైన విషయం.

వ్యవస్థలోని అతి చిన్న లోపమే తొలి తప్పు.

ఒక సంఘటనగా ప్రారంభమైన ఆ తప్పు, బలపడి, క్రూరమైన వైఖరిగా మారి, చివరకు అణచివేతగా రూపొందుతుంది. పాలకులు, సంపన్నులు, బలాఢ్యులు శతాబ్దాలుగా పాలితులు, పేదవారు, బలహీనులను హింసకు గురిచేయడం మామూలేనని చరిత్ర ద్వారా మనకు తెలిసిందే. నిశితమైన ఆలోచన, లోతైన అవగాహన ఉంటేనే తప్పును గుర్తెరగవచ్చు. అట్టి విశ్లేషణ చేయగల నాయకులే, ఆలోచనా దృక్పధాన్ని విస్తరింపచేస్తారు.

సత్యాన్వేషణ–సోక్రటీస్ దుఃఖపు మూలం –బుద్ధుడు స్వతంత్రేచ్ఛ–సామ్యూల్ ఆడమ్స్ విడదీయలేని అంశాలు. నాణానికి మరోవైపు గమనిస్తే, భూస్వాముల దాష్టీకాన్ని లియో టాల్‌స్టాయ్ శ్రామికశక్తి గురి అయ్యే దోపిడీని లెనిన్, మార్క్స్ నల్ల జాతీయులపై రుద్దబడిన వర్ణ దురహంకారాన్ని లింకన్ ప్రశ్నించనంత కాలం మానవ సమాజం ఆ వేదనామయ చీకటిలోనే మగ్గిపోయింది కదా ! ఈ నేపథ్యంలో పరిశీలిస్తే మోహన్‌దాస్ కరంచంద్ గాంధీ మహోన్నత మానవతావాదుల కోవకు చెందిన ఉత్తమ నాయకుడని చెప్పవచ్చు.

నిజానికి, అమూర్త భావనలే మానవ మేధ పై బలమైన ముద్రవేస్తాయి. అవి త్వరలో సామూహిక ప్రవర్తనావళిని శాసిస్తాయి. సంయమనం, సమానత్వం, స్వాతంత్ర్యం మంచివి కాగా, అసహనం, వివక్ష, అసమానతలాంటివి చెడు భావోద్వేగాలు. ఈ రెండిటి మధ్య జరిగే ఘర్షణయే సాంఘిక, ఆర్థిక, రాజకీయ మార్పులకు కారణం.

అహింస, స్వీయనియంత్రణలతో తనకాలంలో నెలకొన్న ఘర్షణను అధిగమించేందుకు గాంధీజీ ప్రయత్నం చేసి సఫలీకృతుడైనారు. "శత్రుత్వం శత్రువుతో కాదు దోషభూయిష్టమైన ఆలోచనా సరళి తో" అని చెప్పిన గాంధీజీ ప్రపంచం రెండు భయంకర సంగ్రామాలతో సతమతమయే వేళ ఉదయించిన కాంతి రేఖ. హింసోన్మాదం ఆవరించిన సమయాన ప్రభవించిన శాంతి కిరణం. దక్షిణాఫ్రికాలో, చంపారన్‌లో, భారత స్వాతంత్ర్య పోరాటం వంటి సందర్భాల్లో పరాయి పాలనపై, దోపిడీపై నిరసనను ఉద్యమ రూపంలో వ్యక్తీకరించారు. తెరచిన పుస్తకంవలె ప్రతి మలుపులో, కార్యకారణ సంబంధాన్ని అన్వయించుకుంటూ నిటారుగా నిలుచున్న పారదర్శకత గాంధీజీలో కానవచ్చే స్పష్టమైన ధోరణి. దీనిని నీతిసూత్రాలు, విలువలు అంటూ

సైద్ధాంతిక చర్చ ఎప్పుడు జరిగినా అది ఆచరణలోకి రాని ఆదర్శంగా ఉండిపోయే ప్రమాదముంది. వాటిని పాటిస్తేనా సమస్యలు రాక తప్పదు. అప్పుడు అవసరమైతే కొన్ని త్యాగాలను చేయాల్సివస్తుంది. అది అడవిలో బాట వేయడం వలే కష్టం. అలలను ఎదిరించి చేసే నౌకాయానంలా పెను సవాలు. దీనిని పరిగణనలోకి తీసుకుంటే, జీవిత చరమాంకం వరకు, తుది శ్వాస విడిచే వరకూ తానునమ్మిన సత్యానికి కట్టుబడి ఆచరించిన ధీరుడు గాంధీజీ.

"సత్యం, అహింస గాంధీ ఉద్యమసూత్రాలు" అని చెప్పి ముగించకుండా, గాంధీజీ జీవితాన్ని మానసిక పార్శ్వం నుండి విశ్లేషించవలసిన అవసరం వచ్చింది.

ఆయనది అత్యంత నిరాడంబరమైన జీవన శైలి. ఇల్లు, ఆహారం, వస్త్రాలు, వస్తువులు, ఆస్తులు వేటినీ గాంధీ సంపాదించుకోలేదు. కుటుంబ సభ్యులెవరికి ఎప్పుడూ ఆశ్రయం ఇవ్వలేదు. టాల్‌స్టాయ్ ఆశ్రమం నుండి సబర్మతి ఆశ్రమం వరకు పదుగురితో కలసి జీవించిన వ్యక్తి. కాసు రొక్కం, సెంటు భూమి ఆయనకు లేవు. బడుగు జీవికి ఉన్న బట్టను, తిన్న తిండిని దైనందిన జీవితంలో స్వీకరించారు. పరదేశం వెళ్లినా 'అర్ధనగ్న ఫకీరు' అనిపించుకుని, బట్టల మిల్లు కార్మికుల వద్ద బసచేసిన నాయకుడు గాంధీజీ. శాస్త్రవేత్తలు, కళాకారులు, విద్యావేత్తలు, తాత్వికులు, విలేకరులు, పరిశోధకులు వచ్చి కలుసుకుని, ప్రత్యక్షంగా చూసి, నిర్ధారించుకుని మరీ ఆశ్చర్యపోయేవారు. అలనాడు డేవిడ్ థోరో ప్రతిపాదించినది, ఈనాడు మేధాపాట్కర్ ఉద్ఘాటించిన 'మినిమలిజం' అనగా 'అతితక్కువ వనరులతో తృప్తిగా జీవించే విధానం' గాంధీజీ ఆచరించి అది సాధ్యమేనని చూపారు. న్యాయవాదిగా ఇంగ్లాండ్ నుంచి బారిష్టర్ పట్టా ఉన్నా, కక్షిదారుల చేత అబద్ధపు సాక్ష్యం చెప్పించవలసి వస్తోందని ఆ వృత్తికి స్వస్తి చెప్పారు గాంధీజీ. ఒకసారి న్యాయస్థానంలో తన వృత్తి రాట్నంపై నూలు వడకటం అని ప్రకటించారు.

సామాజిక రుగ్మతలను ఎదిరించిన ఎందరో సంస్కర్తలను చూడవచ్చు. కానీ, గాంధీజీ అస్పృశ్యత, స్త్రీలపట్ల వివక్ష, హిందూ–ముస్లిం విభేదాలు, నిరక్షరాస్యత వంటి సమస్యలపై స్వయంగా పోరాడి అందుకు అనేక విమర్శలను, తీవ్ర పరిణామాలను ఎదుర్కొన్నాడు. చివరకు 'ఈ వయసు మళ్ళిన నాయకుడు' అని అవమానింపబడి హత్యకు గురికావాల్సివచ్చింది. అంటరానివారికి హరిజనులని నామకరణం చేసి తన ఆశ్రమంలో చేర్చుకున్నారు. మహిళలను పెద్దఎత్తున స్వతంత్ర పోరాటంలోకి ఆహ్వానించి, 'భారత స్వతంత్రం –మహిళా హక్కులు' ఒకేసారి సాధించిన

సర్వోత్తమ స్థితికి సంఘాన్ని నడిపించాడు. ముస్లింలను సహోదరులుగా పరిగణించి ఎన్ని భిన్నాభిప్రాయాలున్నా, చర్చలతో వారికి సన్నిహితంగా మెలిగారు. 79 ఏళ్ల వయసులో 1947 ఆగష్టు 15 న సంబరాలకు దూరంగా, దేశ విభజనవల్ల సంక్షోభంలో ఉన్న ప్రాంతాలలో మృత్యువును ఎదిరించి, శాంతి స్థాపనకు 'రోజుకొక ఊరు' సందర్శించిన గాంధీ ఉన్మాదియో, ఉద్యమకారుడో సామాన్యులకు అంతుచిక్కని జగమెరిగిన సత్యం. స్వయంగా, చీపురు పట్టి ఇతరుల మరుగుదొడ్లు శుభ్రంచేయడమంటే అహంకారాన్ని పూర్తిగా తుడిచిపెట్టడం కాక మరేమిటి? గడియారం నడుముకు కట్టుకుని, 'చెడు అనవద్దు–కనవద్దు–వినవద్దు' అనే మూడు వడపోతలతో, జీవితం ప్రణాళికాబద్ధంగా గడిపిన విశిష్ట వ్యక్తి గాంధీజీ. చదువు, రచన, చర్చ, శ్రమైకజీవనం తప్ప విశ్రాంతి, విరామం లేకుండా ప్రతినిముషం నిర్మాణాత్మకంగా గాంధీజీ గడిపారు. 11 భాషలలో గ్రంథాలను చదివేంత ప్రావీణ్యం సాధించారాయన. గాంధీజీ ప్రవేశించని రంగమే లేదని తోస్తుంది.

ఎక్కడో పోర్బందర్ గ్రామంలో పుట్టిన మధ్యతరగతి కుటుంబీకుడు, పై చదువుకు అప్పుచేయాల్సి వచ్చినవాడు, రవి అస్తమించని బ్రిటిషు దురహంకారంపై తిరుగుబాటు చేయడం ఆశ్చర్యం గొలిపే విషయం. 50 వేల పుటలకు పైగా వ్యాసాలూ, ఉత్తరాలు, పుస్తకాలు వ్రాసిన ప్రముఖ పాత్రికేయుడు.

వీటన్నిటిని గమనిస్తే అవగతమయే నిజమేమిటంటే గాంధీజీకి ఉన్న ఏకాగ్రత చాలా గొప్పది. ఒకేసారి పెక్కు పనులు చేయడంవలన మేధ బలహీనపడుతుంది. ఒకే పనికి పరిమితమైతే నిరాసక్తత ఆవరిస్తుంది. ఈ రెండూ గాక చిత్తశుద్ధితో, ఏకాగ్రతతో ఒకదాని వెంట మరొకటిగా ఎప్పటికప్పుడు సరికొత్త లక్ష్యంతో, క్రియాత్మకంగా ఉండటం ఒక ప్రత్యేకత. దీన్ని ఆధునిక యువత అలవరచుకోవాల్సి ఉంది. విజయం సాధించడమంటే 'ఛార్ట్ బస్టింగ్ సెలెబ్రిటీ స్టేటస్' కాదు. విజయం అంటే స్వయంప్రతిపత్తి. నిజాయితీతో పురోగమించటం బలహీనతలను అధిగమించడం. ఇతరుల పరాజయంలో విజయం లేదు. జీవనసాఫల్యం అంటే, ఎవరికి వారు తమ స్థాయిని మెరుగు పరుచుకోవడమే.

గాంధీ నడచిన దారి ఆయన పేరు మీద మరొక 'ఇజం' కాదు. రహస్యం, మోసం లేని ప్రమాణాలతో నిరంతరం సాగే ప్రయాణం. ఎవ్వరైనా పాటించవచ్చునని ఆయనే ఒక ఉదాహరణగా మనకు చూపిన మార్గం.

## అనుబంధం-అ

# తెలుగు నేలపై గాంధీజీ పర్యటన

**- కాళ్ళకూరి శైలజ**

గాంధీ జీవన విధానం అబ్బురపరిచే ఒక వాస్తవం. సిద్ధాంతాలను పుస్తకాలు, చర్చలకు పరిమితం చేయడం మానవుల బలహీనత. దీనికి భిన్నంగా కష్టమైనా, నష్టమైనా తాను నమ్మిన సిద్ధాంతమే అనుదినం తు.చ.తప్పక అనుసరించే ప్రత్యేకమైన వ్యక్తి మహాత్మాగాంధీ. బోధకులు, గురువులు, సంఘ సేవకులు ఇలా ఉన్నారని చరిత్రలో ఋజువులున్నాయి. కానీ, రాజకీయ జీవితంలో నిజాయితీ, నిరాడంబరత పాటించిన ముక్కుసూటి నాయకులు ప్రపంచంలోనే అరుదు.

గాంధీజీ 1869 అక్టోబర్ 2న జన్మించారు.

1969 ఆయన 'శత జయంతి ఉత్సవం' జరపాలని ఆనాటి భారతదేశ కేంద్ర ప్రభుత్వం నిర్ణయించింది. అందులో భాగంగా కృతజ్ఞతాపూర్వక శ్రద్ధాంజలి ప్రకటించేందుకై దేశంలో ప్రతి రాష్ట్రంలో గాంధీ చేసిన పర్యటనలను గురించిన వివరాలను సంకలనం చేయాలని ఒక బృహత్ ప్రయత్నం మొదలు పెట్టారు. 'గాంధీ స్మారక సంగ్రహాలయ బోర్డు', 'గాంధీ స్మారక నిధి' కలిపి సంయుక్తంగా ఈ పనిని నిర్వహించారు. దీనికై, అప్పటి ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం జీవో నంబర్ : 107716464ను విడుదల చేశారు.

ఆంధ్ర ప్రాంతంలో గాంధీజీ పాల్గొన్న సభలు-సమావేశాల వివరాలు ఈ పుస్తకంలో నమోదు చేయబడ్డాయి. శ్రీ బూర్గుల రామకృష్ణారావు గారి అధ్యక్షతన, శ్రీయుతులు రామకృష్ణ ధూత్, రామానందతీర్థ, లోచన్ దాస్, వల్లూరి సుబ్బారావు, ప్రభాకర్జీ, గోరా, గొట్టిపాటి బ్రహ్మయ్య, క్రొవ్విడి లింగరాజు ఆదిగా గల వారు ఈ సంకలనం కై కృషి చేశారు. సచివాలయ రికార్డులూ, వార్తాపత్రికల్లో వచ్చిన వివరాలు, ప్రముఖుల లేఖలు, యంగ్ ఇండియా ప్రతులు, వివిధ వ్యక్తులు వ్రాసిన వ్యాసాలు, డైరీలు, వీటన్నింటినీ క్రోడీకరించారు.

వీలైనన్ని ప్రత్యక్ష కథనాలు, అనేక ఛాయా చిత్రాలు కూడా యువ పరిశోధకులు శ్రీ పెండ్యాల వెంకట రామారావు గారు సేకరించారు . వ్రాతప్రతి కై శ్రీ జి చంద్రయ్య

గారు అవిరళమైన కృషి చేశారు. 'చారీ ఎండ్ కంపెనీ' ముద్రించిన ఈ గ్రంథం సంకలన సమితికి శ్రీ యుతులు ప్రభాకర్, కోదాటి నారాయణరావు కార్యదర్శులుగా వ్యవహరించారు.

'ఆంధ్రప్రదేశ్‌లో గాంధీజీ' అనే మూలగ్రంథం శ్రీ కొడాలి ఆంజనేయులుగారి సంపాదకత్వంలో తొలిసారి 1975లో వెలువడింది.

మహాత్మాగాంధీ ఆంధ్ర ప్రాంతంలో, 1915, 1920, 1921, 1925, 1927, 1929, 1933, 1934,1937,1946 సంవత్సరాలలో సుమారు పదిసార్లు పర్యటించారు. ఈ వివరాలను విహంగ వీక్షణంగా తెలుసుకునేందుకు మేం ఒక చిన్న ప్రయత్నం చేశాము. అప్పట్లో అవిభక్త ఆంధ్ర రాష్ట్రం మద్రాసు కేంద్రంగా ఉన్నప్పటికీ మేము క్రోడీకరించిన వివరాలలో మద్రాసు పర్యటన వివరాలు జతపరచ లేదు. వీటిలో నుంచి కొన్ని ప్రత్యేక విశేషాలు పరిశీలిద్దాం.

గాంధీజీ రైలులో, మూడవ శ్రేణిలో ప్రయాణించారు. మద్రాసు-బొంబాయి, మద్రాసు-కలకత్తా మెయిల్ రైలును దక్షిణ భారతదేశంలో పర్యటనకై ఎంచుకున్నారు. ఆయన ఒకేసారి ప్రత్యేక రైలు బండిలో పయనించారు. గాంధీజీ ఒక ఊరి నుంచి మరొక ఊరికి కారులో, గుర్రపు బగ్గీలోను ప్రయాణం చేశారు. ఆంధ్రదేశంలోని ప్రముఖ నాయకులంతా గాంధీజీకి అనుయాయులు, శిష్యులుగా మారారు. గాంధీజీ సమయానుసారంగా తాను అవలంబించే ప్రార్థన, మౌనవ్రతం, ఉపవాసాలను పర్యటనలో ఏనాడు వాయిదా వేసుకోలేదు. ఆయన స్వాగత, సన్మానాలను ప్రతిసారీ వ్యతిరేకించారు.

సాధారణ పౌరులతో సభ జరిగిన తరువాత ప్రత్యేకంగా విద్యార్థులు, ప్లీడర్లు, విలేఖరులు, రాష్ట్రస్థాయి నాయకులు, ముస్లిం సోదరులు, క్రైస్తవ మత ప్రచారకులు, ఉపాధ్యాయ వర్గం మొదలైన వారితో గాంధీజీ ప్రత్యేకంగా సమావేశాలను నడిపిన తీరు అత్యంత ఆశ్చర్యకరమైనది. తాను దక్షిణాఫ్రికాలో ఉన్నప్పుడు కలుసుకున్న ఈ ప్రాంతపు ప్రజలతో అనుభవాలను పంచుకున్నారు. ఒరిస్సా- ఆంధ్ర, కర్ణాటక-ఆంధ్ర, ఆంధ్ర-తమిళనాడు సరిహద్దు ప్రాంతాల ప్రజల నడుమ బేధాభిప్రాయాలను గురించి ప్రస్తావన ఈ పుస్తకంలో చూడగలం.

మహిళల సభలు ప్రత్యేకంగా జరపడం ఒక ముఖ్యమైన అంశం.అనేక మహిళలు గాంధీజీ కృషికి, ఆలోచనా స్రవంతికి స్ఫూర్తి పొందేవారు.

మద్యపాన వ్యతిరేకత, స్వావలంబన, ధైర్యం, విదేశీ వస్తు బహిష్కరణ, నగలను వదిలి తోటి వారి పట్ల సానుభూతి, విద్యాదానం ఆచరించాలని గాంధీజీ, తనను కలుసుకోవడానికి వచ్చిన మహిళలకు ఉద్బోధించారు. గాంధీజీని చూడాలని, ఆయన సందేశం వినడానికి కాలినడకన, ఎడ్లబండ్ల పై, చద్ది మూట కట్టుకుని, ఆయా ప్రాంతాల ప్రజలు వేల సంఖ్యలో హాజరయేవారు. అవతార పురుషునిగా, పరమ గురువుగా గాంధీ దర్శనం కోసం ప్రజలు దారి పొడవునా, రైలు స్టేషన్‌లో కూడా గుమిగూడేవారు.

అన్ని చోట్లా పూలతో, నూలు దండలతో, స్వాగత సత్కారాలు ఈ పర్యటనలలో జరిగేవి. ధనికులు తమ శక్తి మేరకు సభా స్థలము నందు ఏర్పాట్లు చేసేవారు. అన్నదానం జరిగేది. ప్రతిచోటా పౌర సభ, శాసన సభ కార్యవర్గ సభ్యులు ఆయనను ఆహ్వానించేవారు. ఎవరు బస ఏర్పాటు చేసినా వేయి నూట పదహార్లు పళ్ళెంలో పెట్టి విరాళం అందించేవారు.

వేదిక నిర్మాణం కై, శ్రమ,సొమ్ము ఖర్చు జరుగుతోందని గమనించిన గాంధీజీ, ‘కదులుతున్న వేదిక’ను ప్రతిపాదించారు. దీనిని మొట్టమొదటి ‘ప్రచార రథం’ అని మనం అనుకోవచ్చు. తాను ప్రయాణం చేసే కారును ప్రజల మధ్యకు పోనిచ్చి, కారు వెనుక అంచు పై కూర్చుని ఆయన ప్రసంగించేవారు.

గాంధీజీ యంగ్ ఇండియాలో వ్రాసిన వ్యాసం ప్రకారం, “ఏప్రిల్ 6 నుంచి మే 21 లోపు చేసిన 45 రోజుల నా పర్యటనలో 319 గ్రామాలను సందర్శించాను.” (పుట 549)

వివిధ సంవత్సరాల్లో గాంధీజీ పర్యటనకు వచ్చినప్పుడు అస్పృశ్యత నివారణ, హిందూ ముస్లిం సౌభ్రాతృత్వం, ఖిలాఫత్ ఉద్యమం, సహాయ నిరాకరణోద్యమం, స్వదేశీ వస్తువుల వినియోగం, చరఖా వాడకం, నిరాడంబర జీవన విధానం, మొదలైన అంశాల గురించి ప్రసంగాలు సాగేవి.

గాంధీజీ కస్తూరిబాతో కలిపి వచ్చిన 1921 సం. 31 మార్చి, ఏప్రిల్ 1లలో బెజవాడలో ‘అఖిల భారత కాంగ్రెస్ సమావేశం’ జరగడం ఒక చెప్పుకోదగిన సంఘటన. దాదాపు దేశంలోని సుప్రసిద్ధ నాయకులంతా దీనికి హాజరయ్యారు.

1929 నుంచి స్వరాజ్య నిధికి, హరిజన నిధికి ఆంధ్రదేశంలో వసూలుచేసిన విరాళాలు వేలకొలది రూపాయలు, విలువైన ఆభరణాలు ఉన్నాయి. ఆంధ్ర దేశ

పర్యటన గురించి మాట్లాడినప్పుడు, అక్కడి వారు ఎంతో కళాత్మకంగా నూలు వడుకుతారని, సంపన్నులని, దాతృత్వ గుణం కలవారని గాంధీ చెప్పుకొచ్చారు. రాయలసీమలో, ఉత్తరాంధ్ర ప్రాంతంలో క్షామ పరిస్థితులను, అవగతం చేసుకుని, చరఖా పై నూలు వడికి, చేతి పనులతో ఉపాధి సంపాదించాలని గాంధీ బోధించడం కనబడుతుంది. కరువు నెలకొన్నపుడు ధనిక వర్గం వారు పేదలకు సహాయం చేయాలని ఆయన కోరారు.

గాంధీజీ ఉపన్యాసాలలో ఉత్కృష్టమైన వాక్యాలుగా తోచిన కొన్నింటిని ఇక్కడ పొందుపరచడం జరిగింది.

"వివాహం వల్ల స్త్రీ పురుషులు సన్నిహితులు అవుతారు. ఒక విధంగా వారు స్నేహితులు అవుతారనుకోవచ్చు".(పేజీ 68)

"నా అంతర్వాణికి తప్ప నేను దేనికీ లోబడను. ఒక ఆదర్శం ఎంతవరకూ ఆచరణయోగ్యమైనదో ఆలోచించే ఈ కార్య విధానాన్ని రూపొందించాను. (సహాయ నిరాకరణ ఉద్యమం గురించి.) (167 పేజీ)

"నా పాదాలు స్పృశించడం, నాపై పుష్ప వర్షం కురిపించటం గానీ లాభ ప్రదాలు కావు. అటువంటి అంధ ప్రేమానురాగాల చేత మీరు ఈనాడు స్వరాజ్య సంపాదనకు ఎంత అర్హత స్థితిలో ఉన్నారో, ఇక ముందు కూడా ఆ స్థితిలోనే ఉండి పోతారు".(373 పేజీ)

"కార్మిక సోదరులకు ఒక మాట. మీరు తాగుడు, జూదం మొదలైన దురభ్యాసాలను వెంటనే మానివేయాలి."

" మనఃపూర్వకంగా దరిద్రులు ఇచ్చిన పైసలు, ధనికులు ఇచ్చే రూపాయలకు సమానం".(398 పేజీ)

"ఒక మనిషి అస్పృశ్యుడిగా పుట్టినట్లు భావించడమే చాలా నీచమైన విషయం. ఒక మహాపాప భారం కింద హిందూమతం విచ్ఛిన్నమయే సూచనలను మనము మన తరంలోనే చూడగలుగుతున్నాము". (683 పేజీ)

దూరాభారం, మార్గాయాసం మచ్చుకు కూడా దరిజేరనీయక, ప్రతి గ్రామానికి వెళ్లి అక్కడి వారితో మాట్లాడి, తన పర్యటన సందర్భంగా హరిజనులకు దేవాలయాల ప్రవేశం ఇచ్చే కార్యక్రమాలలో గాంధీజీ స్వయంగా పాల్గొన్నారు. తిరుమల కొండ పై దేవాలయంలోనికి హరిజనుల దర్శనం అనుమతికై ఆలయ

నిర్వాహకులతో గాంధీ చర్చలు జరిపిన విషయం కూడా ఈ గ్రంథంలో ఉన్నది.

గాంధీజీ తనకు లభించిన కానుకలను వేలం పెట్టి వాటికి కూడా నగదు స్వీకరించేవారు. ఒక రకంగా రాజకీయ నాయకులు ఎలా ప్రవర్తించాలో ఒరవడి సృష్టించారని చెప్పవచ్చు. లభించిన ప్రతి పైసాకు లెక్కలు వ్రాసిమ్మని కోరేవారు. వాటిని 'యంగ్ ఇండియా'లో ప్రచురించేవారు.

ఈ పుస్తకం మహాత్మాగాంధీ మొక్కవోని ఆత్మవిశ్వాసంతో భాష, ప్రాంతం, కులం, మతం, అనే అడ్డుగోడలు లేని సమాజంకోసం కృషి చేసినట్లు మనకు సుస్పష్టంగా తెలియచేస్తోంది.

భారత స్వరాజ్య సాధన కన్న భారత సమాజ సంస్కరణ ఆయన ప్రధాన ధ్యేయంగా కనబడుతోంది. స్వాతంత్ర్యం అంటే నైతిక బాధ్యత, పరిపాలన కాదు, వ్యక్తిగత క్రమశిక్షణ అని పలుమార్లు చెప్పారు. ఆంధ్ర నాయకులతో గాంధీజీ సన్నిహితంగా మెలిగే వారు. ఎన్నో ఉత్తరాలు కూడా వ్రాశారు.

మద్రాసు పర్యటనలో 1915లోనే ఆయన సభాస్థలిలో కుర్చీలు వద్దంటూ అందరూ నేలపైనే కూర్చోవాలని ప్రతిపాదించినట్లు అర్థమవుతోంది.

1921లో కస్తూరిబాతో కలసి వచ్చినప్పుడు, మద్రాసులో ఒక విదేశీ యువతితో జరిగిన సంభాషణ ప్రకారం, అప్పటికి మూడు సంవత్సరాల క్రితం నుంచి గాంధీ దంపతులు పండ్లు, మొలకెత్తిన విత్తనాలు, గోధుమ రొట్టెలు ఆహారంగా స్వీకరిస్తూ మేక పాలు తాగుతున్నారని తెలుస్తోంది. వివిధ రకాల రుచులతో వంట చేయడం దేశ సంపదను వృథా చేయడమేనని చెప్పేవారాయన.

ఈ పుస్తకం చదవటం వలన, ఒక వ్యక్తి దైనందిన జీవితంలో అవలంబించవలసిన నియమాలు, నియంత్రణ అవగతం ఔతాయి. ఆయన ప్రతిపాదించిన సూత్రాలు ఏ కాలంలోనైనా, ఏ దేశస్థులైనా అనుసరించగలిగేవే. సుమారు 1062 పేజీలున్న ఈ పుస్తకం సంగ్రహంగా వ్రాయడం, అందులోని వివరాలను గుదిగుచ్చి ఒక చోట పెట్టడం అసాధ్యమైన పని. కానీ ఒక ప్రయత్నం చేయడం జరిగింది. దీనిని సహృదయులైన పాఠకులు ఆమోదించి, అదనపు వివరాల కోసం, అసలు పుస్తకం, 'ఆంధ్ర ప్రదేశ్‌లో గాంధీజీ' (తెలుగు అకాడమీ ప్రచురణ) చదివి తెలుసుకొనవచ్చును.

(వివరాల పట్టిక తరువాయి పేజీలలో)

# తెలుగు ప్రాంతాలలో గాంధీజీ

| వరుస సంఖ్య | ఏడాది, తేదీ సమయం ఊరు | వాహనం & ఎక్కడ నుంచి ఎక్కడికి | పాల్గొన్న ముఖ్య వ్యక్తులు | |
|---|---|---|---|---|
| 1 | 1915, మే | నెల్లూరు | న్యాపతి సుబ్బారావు, మోచర్ల రామచంద్రరావు, డి.పట్టాభి రామిరెడ్డి, వల్లూరి సూర్యనారాయణ రావు<br>నెల్లూరు | |
| 2 | 1915 జూన్ 1 | నెల్లూరు | కాళేశ్వరరావుగారు తెలుగులోకి అనువదించారు. | |
| 3 | 1919 మార్చి 31 | సికిందరాబాదు నుంచి రైలు<br>విజయవాడ | | |
| | వెంటనే | రైలు<br>బొంబాయి | | |
| 4 | 1920 ఆగస్టు 23 ఉ॥ 3 గం. | కలకత్తా చెన్నై రైలు మెయిల్‌లో<br>మద్రాసు | మొహమ్మద్ గులాం మొహిద్దున్ సాహెబ్<br>ముట్నూరు కృష్ణారావు, చెరుకువాడ నరసింహం, ఉన్నవ లక్ష్మీనారాయణ | |

